వి.బి.రాజేంద్రప్రసాద్ సమర్పించు

జగపతి ఫిలింస్ వారి

# అక్కా చెల్లెలు

JF

నిర్మాత: వి.కృష్ణప్రసాద్ B.Com.

దర్శకత్వం: ఎ.సంజీవి








మాటలు: ఆచార్య ఆత్రేయ  సంగీతం: కె.వి.మహదేవన్  ఛాయా: ఎస్.వెంకటరత్నం  ఆంధ్ర-నైజాం: లక్ష్మీ ఫిలింస్  విడుదల: శ్రీ ఫిలింస్

ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు—1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥



# ఉత్తరాలు

అనివార్య కారణాలవల్ల ఈ వారం న్యూఢిల్లీ లేఖ వెయ్యలేక పోతున్నాము.

తెలంగాణా వ్యాసరచన పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన శ్రీ జి. కృష్ణగారి ఫోటో, వారి ఉత్తరం ఈ దిగువ ప్రచురిస్తున్నాం. —సం.,

"నా స్వగ్రామము ఖమ్మంజిల్లా చింతకాని. నా తండ్రిగారు గడ్డం అప్పయ్య, తల్లి నర్సమ్మ. నా జననం 6—10—1938. ప్రాథమిక విద్య చింతకానిలో. ఆ రోజులలోనే మా అన్నగారు రెండవ ప్రపంచయుద్ధములో మిలిటరీ ఆఫీసర్‌గా వెళ్లుట వలన, మా అన్నగారి మనాదితో మా నాన్నగారు మర



ణించారు. అదే సంవత్సరం మా అన్నయ్యగారు తిరిగి వచ్చారు. తరువాత 1959 వరకు ఖమ్మం ఉన్నత పాఠశాలలో హెచ్. ఎస్. ఎం. ఎస్. సి.లో ఉత్తీర్ణుడనయినాను. ఒక సంవత్సరం ఉపాధ్యాయుడుగా పనిచేసి తరువాత 1960 నుండి 62 వరకు హైదరాబాదులో వి. ఎల్.డబ్ల్యు.గా ట్రయినింగు పూర్తిచేసి 1962 నుండి సర్వీసులో ఉన్నాను. ప్రస్తుతం వరరామచంద్రాపురం సమితిలో వి. ఎల్. డబ్ల్యు.గా చేయుచున్నాను. ప్రస్తుత ప్రపంచం(నవసమాజం)లో ఇప్పుడిప్పుడే బ్రతుక నేర్చుకుంటున్నాను."

* * *

పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్యం వర్ధిల్లుతోందని ఎవరూ అనుకోరు కాని ఇటీవల పశ్చిమ పాకిస్తాన్‌లో హంజర్వాల్ అనే చోట ఒక వ్యక్తిని, అతని ఇద్దరు చిన్న కొడుకులనీ ఒక ఇంట్లో పెట్టి, తాళంవేసి సజీవంగా దహనం చేసినప్పుడు 'పాకిస్తాన్ టయిమ్స్' పత్రిక ఇలా రాసింది— "మానవుడి స్వభావంలో ఇమిడి ఉన్న చెడుకి హంజర్వాల్ పేరు చాలాకాలం చిహ్నంగా ఉండిపోతుంది..." నేరస్థులని పట్టుకుని శిక్షించాలని పైపత్రిక కోరిందిట. పాకిస్తాన్‌లో జరిగిన వాటికి మచ్చుగా మరికొన్ని ఉదంతాలు — తన భర్తపక్కనే నిద్ర పోతున్న 30 సంవత్సరాల వయసు కల ఒక డాక్టరుని 12మంది పఠాన్‌లు ఎత్తుకు పోయారుట., ప్రభుత్వం కలుగ చేసుకొనగా, తోటి డాక్టర్లు సమ్మె చెయ్యగా ఆమెని వదిలి వేశారుట పఠాన్‌లు.

—క్వెట్టాలో 300 మంది గనులలో పని చేసే కార్మికులు ఒక మహమ్మదీయ పండుగనాడు ఆ ఊరిలో వర్తక వనితల ఇళ్లని తగులబెట్టి, వారితో కొందరిని పొడిచి వేశారుట. ఒక మత ప్రచారకుడు వ్యభిచారాన్ని ఖండించగా ఈ విధంగా వారు విజృంభించారో లేదా పడుపు గృహాల వెలవల్ల విజృంభించారో తెలియటం లేదుట.

—ఒక మనిషి తనకి ద్రోహం చేసిందని భార్య ముఖంమీద కారంపూసి తర్వాత ఆమెని రాళ్ళతో కొట్టి చంపేశాడుట.

కొంతకాలం క్రితం ఈ దేశంలో ఒక రాష్ట్రంలో ఒక ప్రభుత్వోద్యోగిని సజీవంగా పెట్రోలు పోసి కాల్చి చంపారు. ఈ దారుణ చర్యని ఎన్ని పత్రికలు ఖండించాయి? పోనీ ఎందరు రాజకీయ వాదులు తమ సంతాపాన్ని తెలిపారు? హత్యలు, దోపిడీలు, లూటీలు చేసిన వారంతా త్యాగ శీలురా?

——హెచ్. కె. వి. రాజు, [రాణీపేట.]

## కథలు

నూతన సంవత్సర శుభాకాంక్షలతో పత్రిక అందుకున్నాము. ముచ్చటగా మూడు కథలు అలరించాయి. [వరుసగా] భాగ్యలక్ష్మి, ఏ. శోభాకామత్ మరియు కంచనపల్లి వెంకట కిషన్ రావు గార్లకు కృతజ్ఞతలు తెలుపగలరు.

బి. గోపాలరావు, [పూనా.]

## సీరియల్

ఆంధ్రసచిత్ర వారపత్రికలో వెలువడుచున్న రెండు సీరియల్స్ చాలా బాగున్నవి. జయలక్ష్మిగారి "లలిత"లో లలితపాత్ర మాకు ఎంతో నచ్చినది. రచయిత్రి గార్కి మా ధన్యవాదములు.

గోగుల రమ, నీల, —(విజయనగరము)

## సినిమా

9—1—70 సంచికలో విశాఖపట్టణం నుండి పి. రవిశర్మ వ్రాసిన లేఖ చదివిన తర్వాత ఆయనను అభినందించకుండా ఉండలేకపోయాను. ఎందుకంటే, సినిమా పరిశ్రమ గురించి పుస్తకప్రపంచం గురించి, ఎంతో బాగా వ్రాసారు. ఇటువంటి ఉత్తరాలు ప్రచురించితే మీ పత్రిక డిమాండ్ మరింత పెరుగుతుంది కాదంటారా?

నాగేశ్వరరావు, (నిజామాబాద్)

* * *

శ్రీమతి శారద ఊర్వశి అవార్డు అందుకున్న శుభ సందర్భంలో ఆమె గురించి మీరు వ్రాసిన కొన్ని







చలం సమర్పించు శ్రీ రమణా చిత్ర వారి

# సంబరాల రాంబాబు

దర్శకత్వం: జి.వి.ఆర్. శేషగిరిరావు　　నిర్మాత: టి. మోహన్‌రావు

శ్రీ ఫిలిమ్స్

విశేషాలు చదివి సంతోషించాము. ఇంతకు పూర్వం శారద కొన్ని తెలుగు చిత్రాలలో నటించినా, 'మనుషులు—మారాలి' చిత్రంలో ఆమె అద్భుత నటనా కౌశల్యం ఆంధ్ర సినీ ప్రేక్షకుల హృదయాలను రంజింప చేసి గొప్ప నటిగా ఆమెకొక విశిష్ట స్థానాన్ని ఏర్పరచింది. ఈ సమయంలో ఆమెకొక అత్యుత్తమ అవార్డు రావటం ఎంతో ఆనందించవలసిన విషయం. ఈ సంతోష సమయంలో శ్రీమతి శారదకు మా హృదయపూర్వక నూతన సంవత్సర శుభాకాంక్షలు పత్రిక ద్వారా అందజేస్తే కృతజ్ఞులం!

సూర్యభాను "ఉష" (హైదరాబాద్)

## వ్యాసాలు

9—1—70 సంచికలో "భారతాభ్యుదయము కాంక్షించే ఫాదర్ ఫెర్రర్" అను వ్యాస రచయితకు, ప్రచురించిన మీకు మా ధన్యవాదములు. అనేక పత్రికలలో ఫాదర్ ఫెర్రర్‌ను గూర్చి చాల విమర్శలు వచ్చాయి. మహారాష్ట్ర ప్రభుత్వము బహిష్కరించినది కనుక ఆంధ్రప్రభుత్వము కూడ బహిష్కరించాలని గ్రుడ్డిగా అనటము వివేకము కానేరదు. అప్పట్లో ఫాదర్ ఫెర్రర్‌ను బొంబాయి నుండి హైదరాబాదుకు రైలు ప్రయాణము చేయకూడదని కట్టడి చేసినపుడు ఎంతగానో విచారించాము. ఆయనపై అలాంటి చర్య తీసుకొనటానికి ఆయన దుర్మార్గాలు (మంచిపనులు) ఏమిటో! అనన్య ప్రచారము గల ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖముగా తెలిసికొని చాల సంతోషించాము. అభివృద్ధి నిరోధకులు ఉన్నంతవరకు పేద భారతీయులకు విముక్తి కలుగదు.

మురళీకృష్ణ, జాన్‌శామ్యూల్, లక్ష్మణరెడ్డి (వరంగల్)

## గేయం

విమర్శిస్తే మొగం ముడిచే
ఉడుకుబోతులు తప్పుకొందిక
ఉంటూ ఉడుకుబోతుల
విసిరి విసిరే శిశిర కవిత



## ఉత్తరాలు

అచ్చులో పేరు కోసం
రాసే ఉత్త ఉత్తరాల
మధ్య మధ్య మధ్య
నిలువుటద్దం తలమానికం

క్రీడల విమర్శించే
క్రికెట్కు విమర్శంటే
కార్టూను గేయాలంటే
అన్నదాతల కిష్టమేమరి

లలాకాని విమర్శలన్ని
చదివి వదలక
ఆంధ్రపత్రిక శిశిర
పెట్టె వాటికి చిత్రిక

వింత హత్యలు, దసికీలు
కొత్తవారల పాత గజల్
రాజకీయ రమణీయతల్
ఎవరికైనను ఇష్టమే మరి.

నోరు పలుకరిస్తూ
నొసలు వెక్కిరించే
పేడి పండ్ల మధ్య
నిలువుటద్దం నిజపుటద్దం

అసందర్భపు ప్రశ్నలడిగే
ఖ్యాటాజు దురభిమానుల
చేతకాని, అర్థం లేని
జవాబులిచ్చే సినీతారలు

నీతి లేని వా(తా)రల
నిజజీవితాలు
కాగితాలు ఖరాబు చేయుకే
తప్పుకుంటే సలాం చేస్తా.

(ఫణి, కాకినాడ.)

## సవరణ

16—1—70 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన '1969 లో విడుదలైన తెలుగు చిత్రాలు'లో 'సప్తస్వరాలు' సంగీత దర్శకుడు శ్రీ కోదండపాణి అని పొరపాటున ప్రచురించబడినది. 'సప్తస్వరాలు' చిత్రానికి సంగీత దర్శకత్వం వహించినవారు శ్రీ టి. వి. రాజు అని పాఠకులు గమనించ కోరుచున్నాము. — సం.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 23—1—'70
శ్రీ సౌమ్యనామ సం॥ పుష్య బ॥ పాడ్యమి శుక్రవారం
సంపుటము : 63 సంచిక : 19

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక


సోషలిస్టుగా ఆమె నటనని ఇది నిరూపిస్తూంది
ఇందిరని పడగొట్టడానికి ఎస్.ఎస్.పి. ప్రయత్నం


ఎప్పుడూ అధికారంలో ఉన్నవారిని బలపరచాలి
18 కోట్లు కేంద్రం సహాయం
13 కోట్లు కేంద్రం సహాయం


చండీఘర్ సమస్య
పంజాబ్
హర్యానా


చీలిక వల్ల రెండు కాంగ్రెసులూ దెబ్బతిన్నాయని తారకేశ్వరి ఒప్పుకున్నారు.
అది కూడా మనకి తగినంత బలాన్ని చేకూర్చింది!

# తెలంగాణా సమస్య, ఉద్యమం

ఆంధ్రప్రదేశ్ ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావుగారు 22–8–1969 నాడు 'ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫెడరేషన్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ' సమావేశంలో చేసిన ఉపన్యాసం సారాంశం ఈ కింద వేస్తున్నాము. డా. మర్రి చెన్నారెడ్డిగారి వ్యాసం ప్రచురించినందువల్ల దీనిని ప్రచురించ వలసినదని ఒక వర్గంవారు కోరగా శ్రీ నరసింగరావుగారి వ్యాసం సారాంశం ప్రచురిస్తున్నాము.

— (సం)

తక్కిన ఎన్నో ఉద్యమాలవలె కాక తెలంగాణా ఉద్యమం వెనుక భావసంయోగం, ఆధారం ఏవీ లేవు. వివిధవర్గాలవారు వివిధ కారణాలవల్ల ఈ ఉద్యమంలో పాల్గొని దానిని తమ స్వప్రయోజనాలకి వాడుకొనటానికి ప్రయత్నించారు. ఇటువంటి ఉద్యమం ప్రపంచ చరిత్రలో వేరెక్కడా కనిపించదు.

## పెద్దమనుష్యుల ఒప్పందం

పెద్దమనుష్యుల ఒప్పందం భగ్నం కావడమే ఈ ఉద్యమానికి ప్రధాన కారణం అని కొందరు అంటున్నారు. పెద్ద మనుష్యుల ఒప్పందం కావాలనుకున్న వారిలో నేను [శ్రీ నరసింగరావుగారు] ఒకడిని. పాత హైదరాబాదు రాష్ట్రంలో ఉండిన కొన్ని ప్రాంతాలు నేటి మహారాష్ట్ర, మైసూరులలో చేరాయి; కాని, ఈ ప్రాంతాలకి చెందినవారు ఏ సంరక్షణలూ లేకుండా మనకన్నా మంచి స్థితిలో ఉన్నారు. వీరు మనకంటే తెలివికలవారని కాదు; భారతదేశ పౌరులుగా తక్కిన వారందరివలే సమానావకాశాలు మాత్రం కోరారు, అంతే. పాత హైదరాబాదు రాష్ట్రంలో ఉత్తర—దక్షిణ భారత సంస్కృతుల సమ్మేళనం ఉండటంచేత ఆ రాష్ట్రాన్ని అలాగే ఉంచాలని అనేవాడిని. అయితే, స్వామి రామానందతీర్థ ప్రభావానికి లోనయిన కొందరు మిత్రులు భాషారాష్ట్రాలవల్ల ప్రజాస్వామ్యం పెంపొందుతుందనటం వల్ల నేనూ పాత హైదరాబాదు రాష్ట్ర విభజనకి అంగీకరించాను. [ఈ సందర్భంలో శ్రీ నరసింగరావుగారి ప్రసంగ పాఠంలోని ఒక వాక్యాన్ని వీలయినంత జాగ్రత్తగా అనువాదం చేసి ఈ కింద వేస్తున్నాము:—

"ఈ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని మేము సరే నన్నాము. మేము పట్టుపట్టాము కాబట్టే ఫజల్ ఆలీ సంఘం మా కన్నీరు తుడవటానికి ఓ సూచన చేసింది. మేము కొంత భాగాన్ని ఉంచుకొనవచ్చు— అది తెలంగాణా కాదు, హైదరాబాదు అవశేషం; ఓదారు, పక్క భాషారాష్ట్రాలతో కలసిన కొన్ని తాలూకాలు—ఈ భాగం అయిదు సంవత్సరాల దాకా [కొన్ని అపార్థాలు, అపోహలు, భయాలు తొలగిపోయేదాకా] విడిగా ఉండి పోవచ్చు అని సూచించింది. ఇది ఒక్కటే ఆధారం. వారు విదర్భకి ప్రత్యేక రాష్ట్ర స్థాయి ఇవ్వటానికి అంగీకరించినప్పటికీ తెలంగాణాకి ఇవ్వటానికి అంగీకరించలేదు" సం. ]

## తెలంగాణా ప్రాంతీయ సంఘం

రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం సూచనలు వెలువడినప్పుడు మేము కొందరం తెలంగాణా ప్రాంతం ప్రజల భయాలని తగ్గించటానికి కొన్ని ఏర్పాట్లు చేయించటానికి ప్రయత్నించాము. విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా ఉంటున్న నా మిత్రుడు ఒకాయన స్కాట్లాండుకి ఇచ్చిన 'స్వతంత్రాలు' కొన్ని ఇవ్వాలనే సూచనలు చెయ్యగా వాటికోసం ఢిల్లీలో అధికారులతో మంతనాలు జరిపాను. నా ప్రయత్నాలు అంతగా నెగ్గలేదు. కాని చివరికి తెలంగాణా ప్రాంతీయ సంఘం నిర్మాణానికి కేంద్రనాయకులు అంగీకరించారు. ఈ ప్రాంతీయ సంఘం అధికారాలు పెంచటానికి నేను చేసిన ప్రయత్నాలలో నా మిత్రులయిన డా. చెన్నారెడ్డిగారిని కూడా పాల్గొనేట్లు చేశాను. ప్రాంతీయ సంఘానికి విద్య, పబ్లిక్ హెల్త్, మునిసిపల్ పరిపాలన మరికొన్ని చిన్న విషయాలు అప్పచెప్పారు. మేము ఒక రకం 'ద్వంద్వ ప్రభుత్వం' [శ్రీ నరసింగరావుగారు 'డయార్కీ' అనేమాట వాడారు—సం] కోసం ఆశించాము. ప్రాంతీయ సంఘం అధికారాలు అంత ముఖ్యమయినవిగా మాకు



రచయిత
ఆంధ్రప్రదేశ్ ఉప ముఖ్యమంత్రి
శ్రీ జె. వి. నరసింగరావుగారు

తోచ లేదు. అయినప్పటికీ తెలంగాణా విషయంలో మా అభిప్రాయాలు వెలిబుచ్చేందుకు వీలు కలిగింది కదా అనుకున్నాము. ఈ ప్రాంతీయ సంఘం స్వతంత్రమయిన సభ కాదు. అది శాసనసభలో ఒక భాగం మాత్రమే. ప్రాంతీయ సంఘంలో జరిగేవి బహిరంగంగా తెలియదగ్గ విషయాలు కావు, ఈ విషయాలు కూడా కొన్ని మాత్రమే. అయినప్పటికీ సంఘం అచిరకాలంలోనే విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, మొదలయిన విషయాలని గురించి చర్చించటం మొదలు పెట్టింది. కేవలం సలహాలు ఇచ్చే సభ వంటిది కాబట్టి ఇందులో ప్రమాదం ఏమీ లేదని అనుకున్నాము కాని, చట్టం ప్రకారం అది సరి కాదు.

తెలంగాణా వెనుకబడిన ప్రాంతం. అందుచేత తెలంగాణా ప్రాంతం ఆదాయం అక్కడే కర్చు అవాలి అన్న పెద్ద మనుష్యుల ఒప్పందంలోని షరతు కొందరికి అర్థం కాక పోవచ్చు. అసలు విషయం ఏమిటంటే, తెలంగాణాలో మద్యపాన నిషేధం లేకపోవటంచేత 8–10 కోట్ల రూపాయల అబ్కారీ ఆదాయం ఇప్పటికి 15 కోట్ల రూపాయలు అయింది. అంటే; ఆంధ్ర ప్రాంతంలో మద్యపాన నిషేధం తొలగించేదాకా మన ఆదాయాన్ని మన ప్రాంతంలోనే కర్చు పెయ్యాలనుకున్నాము. మా ఉద్దేశం ఇదొక్కటే కాని, మేమే వరంఆర్థిక నిపుణులం కాదు. ఆదాయాలని ఎలాగ లెక్క వెయ్యాలో, ఏ విధంగా లెక్క వెయ్యాలో మాకు తెలియదు. ప్రాంతీయ సంఘం వారు తమ నివేదికలని పంపిస్తానే ఉన్నారు; రెండవ ప్రణాళిక ముగిసే సమయానికి తెలంగాణా మిగుళ్లలో 22 కోట్ల రూపాయలు కర్చు చెయ్యబడ్డాయి.

## ఉద్యోగాలు

300 రూపాయల దాకా జీతం కల ఉద్యోగాలన్నిటిలోనూ తెలంగాణా ప్రాంతంలో ఆ ప్రాంతం వారినే వెయ్యాలని పెద్ద మనుష్యుల ఒప్పందంలో ఉంది. తెలంగాణా ప్రాంతంలో విద్యాభ్యాసం వెనుకపడి ఉండటంచేత ఈ షరతు పెట్టినా, అప్పుడు కూడా తెలంగాణా ప్రాంతంవారు ఎల్లకాలం ఈ విధంగా వెనుకపడే ఉంటారని నేను అనుకోలేదు. ఈ రకం 'సంరక్షణ' తాత్కాలికమే అన్నాము. షెడ్యూల్డ్ తరగతి వారికి 10 సంవత్సరాలు ఇచ్చారు కాబట్టి మాకు 5 సంవత్సరాలు చాలునని అనుకున్నాము. ఇది కొందరు చెప్పినట్లు శాశ్వతమయిన ఏర్పాటు కాదు. సంరక్షణలు లేకపోతే మనకి 'ముక్తి' లేదని నేనెప్పుడూ న్యూనతా భావంతో బాధపడలేదు. కర్ణాటక మహారాష్ట్రాలలో చేరిన ప్రాంతాలవారెవరూ సంరక్షణలకోసం అడగ లేదు. 5 సంవత్సరాల గడువుని మరొక 5 సంవత్సరాలకి పొడిగించారు. ఇది మార్చి 1969కి అయిపోవలసింది. మేము కూడా మరొక

ర్ సంవత్సరాల పొడిగింపు కావాలని అడిగాము.

## మిగుళ్లు

శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు నాయకత్వం వహిం చిన ప్రభుత్వం అధికారంలోకి రాగానే తెలంగాణా సంరక్షణలు, మిగుళ్లు—వీటికి సంబంధించిన అను శీలన జరిపి కొన్ని అంచనాలు వేసి, 1968 నవం బరులో గవర్నరు రెండు సభల ముందరా చేసిన ప్రసం గంలో మిగుళ్ల మొత్తాన్ని పేర్కొన్నాము. ఇది రు 30.54 కోట్లు అని ప్రభుత్వంవారు అంచనా వేశారు. ఈ మొత్తం నాలుగవ ప్రణాళికలో ఖర్చు పెడ్తామని హామీ ఇచ్చారు. ఇదంతా తెలంగాణా ఉద్యమం మొదలయ్యే ముందే జరిగింది.

## ఉద్యోగాలలో రిజర్వేషన్లు

తెలంగాణా వారికి కేటాయించిన ఉద్యోగాలలో ఆంధ్రప్రాంతం వారు ఎందరు ఉన్నారో ఎవరూ లెక్క వెయ్యలేదు. ఈ ప్రభుత్వమే లెగిన సమాచారం సేకరించి మొత్తం 1,07,538 ఉద్యోగాలు తెలం గాణా వారికి కేటాయించగా వాటిలో 4538 ఉద్యో గాలు ఆంధ్రప్రాంతంవారికి ఇవ్వబడినట్లు తెలుస కున్నాము. 1968 జూలయి నెలలోనే, ఇంకా ఎవరూ చిటికెనవేలు కదిపేముందు, ఈ 4538 మంది ఉన్న ఉద్యోగాలలోనూ తెలంగాణా వారినే వెయ్యాలనే జి. ఓ. జారీ చేశాము. నేడు ఉద్యమాన్ని నడిపే మిత్రులు శ్రద్ధచేసిన విషయంలో వారికన్నా ముందే మేము మేలుకుని తగినచర్య తీసుకుంటే అది నేరమా? "జరిగిన తప్పులని సరిదిద్దు కుందా దాము" అన్నాము. పయిన చెప్పిన వారిలో 1600 మంది టీచర్లు. వీరికి ఈ ఉద్యోగాలని తెలంగాణా జిల్లా పరిషత్తుల అధ్యక్షులు తాత్కాలికంగా ఇచ్చారు. 1800 మంది ఆరోగ్యశాఖ సిబ్బంది ఉండేవారు— నర్సులు, ఇతరులు. కేరళనుంచి వచ్చిన నర్సులు ఇండియాలో కాశ్మీరు నుంచి కన్యాకుమారి దాకా ఉన్నారు. ఢిల్లీ ఆసుపత్రిలో నర్సులలో మూడవ భాగం కేరళవారు. కాని, తెలంగాణాలో కేరళ నర్సుకి స్థానం లేదంటున్నారు. ఉద్యమ నాయకులలో కనీసం 3, 4 రికి డాం. ముల్కీ సర్టిఫికేట్లు ఉన్నాయి. ఈ పేర్లు శాసనసభలో ఉదయించిన కొన్ని ప్రశ్నల సందర్భంలో పేర్కొబడ్డాయి.

## అన్యాయం, అతిశయోక్తి

పార్టీలలో, వర్గాలలో విభేదాలు ఉండవచ్చు, వ్యక్తులు పోట్లాడుకోవచ్చు. కాని, ఇంతా పార్టీలోనే ఉండాలి, ప్రజలని ఇందులోకి ఈడవ రాదు. వారు వర్గ యుద్ధాలని కప్పిపోగొట్టి వ్యక్తులమధ్యవిభే దాలని అన్యాయాలుగా మార్చి ప్రచారం చెయ్యటం జరిగింది. జనం, 'అన్యాయాలు' అనటం మొదలు పెట్టారు. అవి ఏమిటో వాళ్ళకు అర్థం కావటం లేదు.

## అన్ని పార్టీల సమావేశం

గాంధీజీ జయంతి నాడు ముఖ్యమంత్రి పిలిచిన సమావేశానికి అన్ని పార్టీల వారినీ సమావేశ పరిచారు. ఆయన తప్పులు సరిదిద్దుతామన్నప్పటికీ "మీరే మీ తప్పులని ఒప్పుకుంటున్నప్పుడు—" అన్న ధోరణి కనిపించింది. ముఖ్యమంత్రి చెయ్యని తప్పుల బాధ్యత ఆయనదా? మిగుళ్ళని అంచనావేసి నాలుగవ ప్రణాళికలో తెలంగాణాలోనే ఖర్చుపెడ్తా మని మాట ఇచ్చాము. ఉద్యోగాల విషయంలోనూ అంతే. ప్రభుత్వాలు పరంపరగా వస్తాయి. మా బాధ్యతలని మేము ఎన్నటికీ విడనాడ లేదు.

[మిగుళ్ల లెక్కింపుకి శ్రీ కుమార్ లలిత్, శ్రీభార్గ వాలని నియమించటం గురించి శ్రీ నరసింహారావు గారు వివరంగా చర్చించి మిగుళ్లనిర్ణయంలో జోరలు కూడదని సూచించారు. అంతేకాక, ఆంధ్రప్రాం తంలో లోటులో సగంతెలంగాణా మిగుళ్ళకి చేర్చాలనే వాదాన్ని పేర్కొంటూ దానిని తాము కాదనలేదనీ ఇదంతా నిర్ణయించేది ఒక సుప్రీమ్‌కోర్టు న్యాయ మూర్తి అని గుర్తించుకోవాలని అన్నారు. మిగుళ్ళ నిర్ణయం కోసం ఆగకుండా తాము జిల్లాకి కోటి రూపాయల చొప్పున ఈ ఏడు ఖర్చు పెట్టడానికి నిశ్చయించుకున్నట్లు చెప్పారు. పరోక్షంగావయినా ఈ మొత్తం ఏటా అయిదు సంవత్సరాలదాకా ఖర్చు చెయ్యాలని ఒప్పుకున్నామన్నారు. అమ్మకం పన్ను ఆంధ్రప్రాంతంలో వసూలయినప్పటికీ, హైదరా బాదులో చెల్లించడంవల్ల తెలంగాణా ఆదాయం అసహజంగా పెరిగిందన్న వాదాన్ని పేర్కొంటూ అందులో న్యాయం ఉన్నదీ లేనిదీ నిర్ణయించ టానికి శ్రీ భార్గవా ఉన్నారన్నారు.

---

'...మూడు సంవత్సరాల క్రితం అప్పటి కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ్ ఎరువు ప్రాజక్టులలో విదేశీ వాటాలని అనుమతించటం గురించి అప్పటి ఆహార శాఖామంత్రి శ్రీ సుబ్రమణ్యంని బహిరంగంగా సవాలు చేశారు. ఇది 1948 పారి శ్రామిక విధానం తీర్మానానికి విరు ద్ధంగా ఉందన్నారు. నిజం, సోష లిజమ్, దేశభక్తి కామరాజ్ పక్షమే ఉండినవి. నేడు శ్రీమతి గాంధీ యొక్క రియాక్షనరీ ప్రభుత్వం 65 శాతం అమెరికన్ వాటా కల ఎరువు ఫాక్టరీకి లైసెన్సు ఇచ్చింది. పరిపాలనలోకూడా అమెరికన్లదే పైచెయ్యిగా ఉంటుంది—11మంది డైరెక్టర్లలో 6 గురు అమెరికన్లే ఉంటారు.' (10—1—70 ఆర్గ నయిసర్.)

* * *

'బ్లిట్స్‌కి బిర్లాలంటే పగలేదు కాని ఇది విధానానికి సంబంధించిన విషయం. విదేశీ వాటా అధికంగా ఉండటానికి వీలులేదనే విధానాన్ని ప్రభుత్వం స్పష్టంగా ప్రకటిస్తూ వచ్చింది. మరి ఈ సందర్భంలో విదేశీ వాటాదరులకి 59.4 శాతం ఈక్విటీ ఎందుకిచ్చారో సమస్యగా ఉంది.' (10—1—70 బ్లిట్స్)

---

## సంరక్షణలు

సంరక్షణల విషయం గురించి మాట్లాడుతూ శ్రీ నరసింహారావుగారు ప్రభుత్వం తెలంగాణా ప్రాం తంలో ఆంధ్రప్రాంతం నుంచి వచ్చి ఉద్యోగం చేస్తున్న వారందరినీ, బదిలీ చెయ్యటానికి జరిగిన ప్రయత్నాలూ, ఏర్పాట్లూ న్యాయసానంవారు ఈ సందర్భంలో ఇచ్చిన తీర్పూ, ప్రభుత్వం వారు తెచ్చుకున్న 'స్టే' గురించి చెప్పారు. తెలంగాణా ప్రాంతంలో ఉంటూ వచ్చిన 'ఆంధ్రులు' విదేశాలకి వెళ్లిపోయినట్లు వెళ్లిపోవాలని కోరిన జనవరి 19వ తేదీ ఒప్పందం సరయినది కాదని అన్నారు. సుప్రీమ్ కోర్టు తీర్పు విరుద్ధంగా ఉంది కాబట్టే అవసరం మయితే రాజ్యాంగం సవరణ కావాలని తాము కోరిన విషయం వివరించారు. అంతటితో ఊరుకోనక ప్రతి జిల్లాలో కొత్త ఉద్యోగాలు సర్పించి 1600 టీచర్లలో 1200కి తగిన ఏర్పాట్లు చేశామన్నారు. మిగిలిన 400 మంది కూడా ఈ ఖాళీ పోయాలని పుర స్కరించుకుని వెళ్లిపోవచ్చునన్నారు. నర్సులని వెళ్ల గొట్టటం సరి కాదన్నారు. రు 300 దాకా జీతాలు కల ఉద్యోగాలని పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఆధ్వర్యం నుంచి కలెక్టర్ల ఆధ్వర్యం కిందికి మార్చినట్లు వివ రించారు. శ్రీ నరసింహారావుగారు జీతాల స్కేళ్లలో వ్యత్యాసాలని గురించి మాట్లాడుతూ ఇవి ఇతర రాష్ట్రాలలో కూడా ఉన్నాయనీ, వాటి విషయ మయి పరిష్కారానికి అన్వేషణ జరుగుతున్నదనీ అన్నారు. రాష్ట్ర పునర్నిర్మాణ చట్టం ప్రకారం రాష్ట్రాలలో గెజెటెడ్, నాన్‌గెజెటెడ్ ఉద్యోగుల సమస్యల విషయమయి చర్య తీసుకొనగల సంస్థలు రెండే, ఒకటి స్టేట్ అడ్వయిజరీ కమిటీ, రెండవది సెంట్రల్ అడ్వయిజరీ కమిటీ. అడ్వయిజరీ కమిటీ చేసిన సిఫారసుని, తిరిగి మరొక సంస్థ ప్రమేయం లేకుండ, రాష్ట్ర ప్రభుత్వమే అమలు పరచటానికి తగిన ఏర్పాట్లు తాము చేస్తున్నట్లు శ్రీ నరసింగ రావుగారు అన్నారు. తెలంగాణా సిబ్బందికి జరిగిన అన్యాయాలన్నిటినీ పరిదిద్దటానికి ప్రయత్నిస్తున్నా మన్నారు.]

## ఉద్యమంవల్ల నష్టాలు

తెలంగాణా ఉద్యమంవల్ల కలిగిన నష్టం రు. 52 కోట్లు అని ఆర్థిక, గణాంకాల వారు అంచనా వేశారు. ఇది పెద్దనష్టం.

(64వ పేజీ చూడండి)

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

25 ఏళ్ళ రంగనాథన్ అనే అతను 18 ఏళ్ళ చిన్నపాప అనే ఆమెను ఆర్నెలల క్రితం వివాహం చేసుకున్నాడట. కానీ చిన్నపాప వేరొకతనితో ప్రేమ కలాపాలు జరపడం చూసి అతను వారించబోయే సరికి చిన్నపాప అలిగి పుట్టింటికి వెళ్ళిపోయిందట. రంగనాథన్ 'కుందప్పళ్ళి' కి వెళ్ళి నచ్చచెప్పబోయే సరికి ఆమె ససేమిరా అందట. ఆవేశంతో ఆమెను, కత్తితో పొడిచి చంపేశాడట రంగనాథన్.

*  *  *

కోయంబత్తూరు జిల్లాకు చెందిన ఈరోడ్డు అనే వూళ్ళో నూనె వ్యాపారి రంగస్వామి అనే ఆయన తన కుటుంబాని కంతటికీ విషంపెట్టి తనూ తిని, చనిపోయాడట. భార్యా, తనూ, తొమ్మండుగురు పిల్లలు—మొత్తం పదకొండు మంది శవాలూ వారింట్లో కుప్పగా పోలీసులకు దొరికాయట. ఆయన పెద్ద కూతురు రాజేశ్వరి 20ఏళ్ళ అమ్మాయి.




ఆయన రాసిన ఒక ఉత్తరంలో "ఈ దారుణ హత్యాకాండకు కేవలం నేనే కారకుణ్ణి. ఎవరినీ అనుమానింప పనిలేదు." అని వుందట.

## లేబర్ మంత్రిపై దౌర్జన్యం

మధ్యప్రదేశ్ లేబర్ మంత్రి మిస్టర్ గంగారామ్ తివారికి, "క్రిస్మస్ పండుగకి యీరాత్రి విందుకు మా యింటికి తప్పక రావాలి" అని 23 వ తేది రాత్రి ఫోను పిలుపు వచ్చిందట. ఆయన ఆ రాత్రి 8.30 కు భారత్ హెవీ ఎలెక్ట్రికల్స్ ఆసుపత్రిలో నర్సు పని చేస్తున్న మిసెస్ అనే ఆమె యింటికి వెళ్ళే సరికి, ఆమె ఆశ్చర్యపోయి, "నేనో..అలాంటి దేమీ లేదే" అని, తీరా ఆయన వచ్చారు కనుక. "కూర్చోండి. కాఫీ యిస్తాను" అని వంట యింటి వైపు వెళ్ళిందట.

ఆమె కాఫీ కలుపు కొచ్చేలోగా ఎవరో యిద్దరు అపరిచిత వ్యక్తులు యింట్లోకి జొరబడి, తామ వల్లమంది మూటలో రెండు బొంబాయికి తీసుకు వెళ్ళాలనీ, మర్నాడు బొంబాయి కాంగ్రెసు సభలకు తివారీ వెళ్ళే కారులో తమని ఎక్కించుకోవాలనీ మిస్టర్ తివారిని కోరారట. ఆయన దానికి అంగీకరించలేదట. దాంతో వారు ఆయన నోట్లో గుడ్డలు కుక్కి గొడ్డును బాదినట్టు బాది, రివాల్వరు, కత్తులు చూపించి "మీ యిద్దర్నీ చంపేస్తాం" అని బెదిరించారట. అప్పటికి తివారి లొంగలేదట. వారు ఆయన్ని 20 వేల రొక్కం కూడా అడిగారట. దేనికి లొంగనందు వల్ల ఆయన బట్టలు విప్పి నగ్నంగా చేసి బాధలు పెట్టారట.

అంతేగాక ఆమెనూ దాదాపు నగ్నంగా చేసి వారిద్దరూ అక్రమ సంబంధం కలిగి వున్నట్లు కొన్ని ఫోటోలు తీసి, "వప్పుకోక పోతే యివన్నీ పేపర్లలో వేయిస్తాం" అన్నారట. తివారి లొంగనే లేదట. దాదాపు రాత్రంతా ఆయన్ని చిత్రహింసలు పెట్టాక, తెల్లారుతూనే ఆయన డ్రయివరు వచ్చే సరికి, "పోలీసుల్ని కేకెయ్" అని తివారీ అరిచారట. డ్రయివరు పోలీసులను పిల్చుకొచ్చేసరికి ఆ ఆగంతకు లిద్దరూ పారిపోయారట.

"నగ్నంగా వున్న మిస్టర్ తివారికి నా సుద్ది పే నిచ్చాను." అందటామె.

మిస్ వ్రాసిష్ తనను తివారి బలాత్కారించరని పోలీసులకు యిచ్చిన రిపోర్టు కేవలం అబద్ధమనీ, కొంతమంది తనను భయపెట్టడం వల్ల ఆవిధంగా యిచ్చాననీ ఆమె చెప్పిందట.

ఆమె వుద్యోగంమాని ఇండూర్ వెళ్ళిపోయింది.

మిస్టర్ తివారి వుద్యోగానికి రాజీనామా యిచ్చారట. ఈ విపరీతం భోపాల్‌లో జరిగింది.

## భార్యా వియోగం—వైరాగ్యం—విషాహారం

మద్రాసు రైల్వేశాఖలో పని చేస్తున్న సుబ్రహ్మణ్యం అనే ఆయన తన అరుగురు కూతుళ్ళను నలుగురు కొడుకులను పూనాకి 130 మైళ్ళ దూరంలో వున్న షిర్డీ అనే వూరు సాయిబాబా మందిరానికి తీసుకువెళ్ళాడట. అక్కడ దేవస్థానంలో రూము తీసుకున్నారట. అనక ఆ రూము తలుపు లోపలకు వేసి వుండడంవల్ల అనుమానం వచ్చి ఆ మందిరం అధికారులు, పోలీసు అధికారులు తలుపు పగులకొట్టి చూస్తే తండ్రి—పదిమంది పిల్లలు—మొత్తం పదకొండు మంది చచ్చిపడి వున్నారట. విషాన్నం తినడం వల్ల వీరందరూ మరణించారని తేలింది.

సుబ్రహ్మణ్యం భార్య నాలుగు నెలల క్రితం కాన్పులో చనిపోయిందట. అప్పటి నుంచీ ఆయన ఒకరకమైన వైరాగ్యంలో వుంటున్నాడనీ, కాశీ రామేశ్వరం వగైరా పుణ్యక్షేత్రాలకు వెళ్ళి వచ్చాడనీ పోలీసులు వార్తలు సేకరించారు.

ఆయన పెద్దకూతురు 22 ఏళ్ళ లీల బియస్సీ పాసయిందట. తను ఆత్మహత్య చేసుకోడమే గాక చెట్టంత ఎదిగిన పిల్లలను, చిన్నపిల్లలనూ కూడా చంపిన కారణం మాత్రం యింకా తెలియలేదు

## భర్తమీద కోపం—పిల్లలకి విషం

"నా పుట్టింటి కెళ్ళొస్తా" అని ఆయమ్మ అనే ఆమె తన భర్త నారాయణరెడ్డిని అడిగిందట. ఆయన వీల్లేదు పొమ్మన్నాడట. అసలే భార్యా భర్తలకు పొత్తు లేదట. భర్త తన మనస్సు కష్టపెట్టాడని ఆమె విషం అన్నంలో కలిపి, తన 4 ఏళ్ళ కొడుక్కీ, రెండేళ్ళ కొడుక్కీ పెట్టి తనూ తిందట. ఆ విషం ఆమెకు మాత్రం పని చేయక పోడంవల్ల హంతకురాలిగా చట్టానికి పట్టుబడింది.



# డబ్బు ఏమైపోతోంది?



కె. రామలక్ష్మి

పెళ్లి అయిన కొత్తలో పెళ్ళాం చేతిలో ఖర్చు పెట్టేయడం సరదా. కాని పోను పోను అవసరానికే డబ్బు అడిగి పుచ్చుకోవలసి రావచ్చు. అమ్మాయి ఈ సంగతి బాగా అర్థం చేసుకోవడం మంచిది. భార్యా భర్తలు చిన్నం చితకా దెబ్బలాడుకోవచ్చుగాని ఆ దెబ్బలాటలూ, దెప్పులాటలూ డబ్బునిగురించి కాకూడదు.

డబ్బు విషయంలో మాట పట్టింపులు రావడం ప్రారంభిస్తే — భార్యా భర్తల మధ్య నమ్మిక సన్నగిల్లుతోందని భావించవచ్చు—కారణం — సాధారణంగా సంపాదించేవాడు మగవాడూ, ఖర్చుకి కారణం ఆడదీగా తోచడమే?

జీతం తేగానే దాన్ని ఎలా వాడాలి? ఎలా సద్దాలి అన్నదానికో ప్లానూ బడ్జెటూ వేసుకోవాలి. ఇంటి ఖర్చుకి, ఇతర ఖర్చులకీ అంటూ విడివిడిగా ఆలోచించుకపోతే మొదటివారంలో మహారాజూ రెండో వారంలో సేవించే పారువాడూ అనిపించుకోక తప్పదు కదా.

పెద్ద సంసారంలో ఉన్నా, విడిగా చిన్న కుటుంబంలో ఉన్నా ఆడవానికి పొదుపు అర్థం కాకపోతే ఆ ఇల్లు ఎప్పటికీ దారిన పడదనే చెప్పుకోవచ్చును. 'మాకేం? ఎలా ఖర్చుపెట్టినా ఫరవా లేదు' అనుకుంటారు — జాయింట్ ఫామిలీలో ఉంటే. 'మా కసలు ఖర్చే లేదు' అనుకుంటారు విడిగా ఉంటే. కాని రెండూ అర్థంలేని మాటలే.

జాయింట్ కుటుంబంలో బాధ్యత లిమిటెడ్. విడి కుటుంబంలో బాధ్యతకి అంతే లేదు! 'అంతా కలిసి ఉంటే ఖర్చు కలిసి వస్తుంది' అంటారు కాని నేర్పరి కాని వారికి అక్కడా, ఎక్కడైనా ఖర్చంతా నెత్తిని పడక తప్పదు. ఇంటి ఖర్చులో భర్త నేర్పరితనం కంటే భార్యకి ఉండాలి నేర్పు. పదిరోజులకని తెచ్చిన సామాను అని పదిహేను రోజులు గడప కల్గడం, నెలలో కనీసం ఓ రేవైనా చాకలికి తగ్గించ కల్గడం లాంటి చిన్న నేర్పులు ఎంతో అవసరం. అలాగే వంటా వార్పులోకూడా. కాని 'నేను పొదుపుచేసి ఏం ప్రయోజనం? ఆ డబ్బేం వారు నా చేతికి ఇస్తారు కనుకనా?' అంటూ నిట్టూర్చే భార్యలు ఉంటారు. వారిలోని ఈ అసంతృప్తి నిత్య జీవితంమీద ఛాయలాగా పరుచుకుంటుంది. సందేహం లేదు. కొందరు మగవారికి డబ్బు దాబుగా పై ఖర్చులకీ జల్సాలకీ అనిపిస్తుంది. 'నే కష్టపడి సంపాదించాను. నేను ఖర్చు పెట్టుకుంటాను' అంటారు. కాని యిలాంటి పెద్దమనుషులు ముందే ఆలోచించుకుని పెళ్లి చేసుకోకూడదు — అప్పుడు హాయిగా తమ సంపాదన తాము ఖర్చు చేసుకుంటూ ఉండవచ్చు.

ఇల్లు సంసారం అన్నవి ఎంత ప్రేమ ఆదరణలమీద నడిపిద్దామన్నా—కుదరదు డబ్బు లేకుంటే. నెలలో రెండు వారాలు అన్నం, రెండువారాలు ప్రేమా భోజనం చేసి ఉండలేరు కదా?

కొత్త పెళ్లికూతురు—కొద్ది మాసాల జల్సా తరువాత కళ్లు తెరవాలి— ఎంత రాబడి? ఎంత ఖర్చు? అన్నవి గుర్తించి వాటికి తగినట్టు ప్లాను మెంటల్ గానైనా వేసుకోవాలి. అదృష్టం కొద్దీ, చిట్టితల్లికి 'నువ్వే వాడు, నా కెందుకే బెడద' అని డబ్బు ఇచ్చేసే బంగారు తండ్రి మొగుడైతే—కొమ్ములు పెంచుకో నక్కరలేదు. —డబ్బు చేతికిచ్చి ఖర్చు పెట్టమంటే—బాధ్యతనంతా మన భుజాల పైకి నెట్టుతున్నారని గ్రహించడం మంచిది. 'ఏందు కత్తయ్యా, మిరపకాయ కొంటేకూడా పద్దు రాస్తావ్' అని నే నడిగితే అత్తయ్యేమంటుంది? 'అయ్యో పిచ్చిమొద్దూ, మీ మామయ్య డబ్బంతా తెచ్చి నా చేతుల్లో పోస్తారు. రేపు ఏమైంది అంటే జవాబు చెప్పాలిగా?' అంటుంది. ఖర్చు రాయడం అలవాటు చేసుకోవడం మంచిది. డబ్బు ఏమైపోతోందో అర్థం అవుతుంది. చేతనైతే లెక్కలు చూసి ఖర్చులు నేర్పుగా తగ్గించుకోవచ్చు. 'లేకుంటే డబ్బు ఇలా ఖర్చయింది' అని చెప్పుకోవచ్చు—అత్తవారిల్లు కాదు—సంసారం సాగించడం—ఆడదానికి కత్తి మీద సాము!

(పైహారం. వేలు వెత్రికగ్గాలి)

జీవితంలో ప్రతి అడుగు ఎంతో జాగ్రత్తగా వేయాలోయ్!



# తెలంగాణా వ్యాసరచనపోటీలో కన్సొలేషన్ బహుమతిపొందిన వ్యాసాలు

## అటో యిటో తేల్చే అలవాటు లేదు!

"ఆంధ్ర"—"తెలంగాణా" అనే సమస్య రానే కూడదు. వచ్చిందంటే అటో ఇటో తేల్చవలసిన బాధ్యత గద్దె మీద కూర్చున్న వారిపై ఉంటుంది. కాని మన నాయకులకు మాత్రం ఇది అంత ముఖ్య సమస్యగా తోచటం లేదు. అసలు ఈ అలజడికి పునాది ఏది? ఏమి చేయాలి? అనేది మన నాయకులకు తెలీదు. కాని, ఈ నాయకులలోనే చిచ్చు పెట్టేవారు, ఆజ్యం పోసేవారు, ఆర్పి వేయగలవారూ ఉన్నారు. ఈ అలజడికి మూల కారణం మన నాయకులే కనుక పరిష్కారం జటిలముగా మారింది. తమ స్వార్థంకోసం, పదవీ వ్యామోహంతో కొందరు దురాశా పరులు ఈ అలజడిని లేవదీశారు. ఈ అలజడిని ఆదిలోనే అణచి వేయవలసింది మన ముఖ్యమంత్రిగారు. కాగా ఆలస్యం చేశారు. ఆలస్యంగా నయినా కొందరు క్రాంతికారుల కోరికలు తీరాయి కాని వారివల్ల ఉత్పన్నమయిన అలజడి వారిచేయి దాటి పోయింది. ప్రజా ఉద్యమంగా మారింది.

మన ప్రతి రాజకీయ నాయకుని అసమర్థత ఇందు కన్పిస్తుంది. అర్హత లేని వారిని గద్దె ఎక్కించుట వలననే ప్రజాభిప్రాయాన్ని అర్థం చేసుకోలేక పోతున్నారు. కేవలం ప్రత్యేక తెలంగాణా కొరకు ఇంత అల్లరి జరగాలా? ఇంత నష్టం కలగాలా?? ఇంత మంది ఆహుతి కావాలా??? అసలు ప్రత్యేక తెలంగాణా ఎందుకు ఏర్పాటు చేయకూడదు? లేక తెలంగాణా విద్యా ఉద్యోగ రక్షణలు ఎందుకు ఇవ్వకూడదు? ఈ సమస్యా పరిష్కారానికి కేంద్ర నాయకులు రావాలా? ఈ అలజడి ఇలా సంవత్సరాల తరబడి రగులు కోవాలా? అసలు అటో ఇటో తేల్చే అలవాటు మన ప్రభుత్వానికి లేదు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఆంధ్రా రూల్సు అని తెలంగాణా రూల్సు అని ప్రభుత్వం లోనే ఇటువంటి భేదాభిప్రాయా లున్నప్పుడు తెలంగాణా ప్రజల అలజడి న్యాయ సమ్మతమే.

మన ప్రభుత్వం ఇప్పటికయినా కన్ను తెరిస్తే!... రాష్ట్ర పునర్నిర్మాణ సంఘాన్ని ఏర్పాటు చేయవచ్చు, లేదా ప్రజాభిప్రాయ సేకరణ జరిపించవచ్చు. లేదా ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు చేయవచ్చు, లేదా తెలంగాణీయులకు విద్యా, ఉద్యోగ రక్షణలు ఇవ్వవచ్చు. ఇవన్నీ ఏవీ చేత కాకపోతే గద్దె దిగి పోవచ్చు.

—జి. కృష్ణ

---

## ఉపరాష్ట్రంగా చేయడమే పరిష్కారం!

పరిష్కారం సూచించేముందు సమస్య ఎలా ఏర్పడిందో తెలిసికోవాలి. ఇటువంటి సమస్య తెలంగాణా ప్రాంతానికొక్కదానికే పరిమితం కాదు. ప్రతి రాష్ట్రంలోనూ, వేర్వేరు ప్రాంతాలలో ఆర్థికాభివృద్ధిలో వ్యత్యాసాలున్నవి. అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో కూడా అన్ని జిల్లాలు లేక ప్రాంతాల అభివృద్ధి సమస్థాయిలో లేదు. మన రాష్ట్రంలోనే కోస్తా ప్రాంతంలో కూడా ఈ వ్యత్యాసాలున్నవి. ఇక తెలంగాణాలో కూడ కొన్ని ప్రాంతాలు మిగిలిన వాటికన్నా మరీ వెనుకబడి ఉన్నవి.

కొందరు ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల నాయకుల భాషల ఉచ్చారణలో చాల తేడాలున్నవంటున్నారు. కోస్తా ప్రాంతంలోనే ఈ తేడాలున్నవి. ఇక ఒకరు మరొకరిని లోకువగా చూసేటందుకు మానవ స్వభావాన్ని మరిచి పోవడం. ఇట్టి స్వభావంకల వారు అందరిలోనూ ఉంటారు. కొన్ని కుటుంబాలలోనే ఇటువంటి స్వభావం గలవారుండటం సామాన్యమే. కాని ఈ కొందరి బుద్ధి పొరపాటును అందరి నెత్తినా రుద్దటం సమంజసం కాదు. ఇటువంటి స్వల్ప విషయాలను గోరంతలు కొండంతలు చేయడం జరిగింది.

ఈ సమస్య స్వతసిద్ధంగా ప్రజలలో మొదలు కాలేదు. దీనికి పూర్తి బాధ్యత అధికారంలో ఉన్న రాజకీయ నాయకులది; ఇన్నాళ్ళూ వీరితో కలిసి మెలిసి అధికారం పంచుకొని నేడు నిరుద్యోగులుగా ఉన్నవారిది; ఇంకా పదవులపై వ్యామోహం ఉన్న ఛోటా నాయకులది. వీరందరి సహకారంతో జరిగిన అసత్యప్రచారం ప్రజలలో విష బీజాలను నాటింది. దీనికి తోడు అధికారంలో ఉన్న పెద్దలు సమయోచితమైన చర్య తీసుకొనక తాత్సారం చేశారు. అసత్య ప్రచారాన్ని అరికట్టే ప్రయత్నాలు తగినంతగా జరగలేదు.

ఇక పరిష్కారం: తెలంగాణాను ఉపరాష్ట్రంగా చేయవలెను. ప్రణాళికలు అభివృద్ధి, ఆర్థిక ఆదాయ, ఖర్చు వంటి ముఖ్యమైన శాఖలు వేరుగా ఏ ప్రాంతానికా ప్రాంతమే ఏర్పాటు చేయాలి. వీలైతే ఆంధ్రప్రాంత కార్యాలయాలను ఆ ప్రాంతాలకు తరలించాలి. ఇక రాష్ట్ర రాజధానిలో రెండు ప్రాంతాలకు చెందిన కార్యాలయాలలో జనాభా నిష్పత్తిలో [1961 లెక్కల] ఉద్యోగావకాశాలు కలుగ చేయాలి. [illegible] ప్రకారం తెలంగాణా మిగులు నిధులను ఆ ప్రాంత అభివృద్ధికే వచ్చే ఐదు సంవత్సరాలలో వినియోగించాలి. ప్రస్తుతం తెలంగాణాలో గత 13 సంవత్సరాలలో జరిగిన అభివృద్ధి [illegible] ప్రచారం ద్వారా [illegible] ప్రచారం చేసి సామాన్య ప్రజలలో అనుమానాలను పార ద్రోలాలి. [illegible] స్వార్థ పరులైన నాయకులకు తప్ప సామాన్య ప్రజానీకానికి ప్రయోజనకారి కాదు. నాయకులలో స్వార్థ చింతన తగ్గి కొంతైనా ప్రజాసేవ చేయాలనే దృక్పథం ఏర్పడితే [illegible] ఎటువంటి పరిష్కార మార్గం ఐనా [illegible] ఫలితాన్నిస్తుంది.

—వి. మురళీమోహన్



# 1970 లో మీ రాశి ఫలం

## కుంభం

ప్రతి సంవత్సరం జనవరి 21వ తేదీ నుంచి ఫిబ్రవరి 19వ తేదీ వరకు సాయన సూర్యుడు కుంభ రాశియందు ఉంటాడు. కాబట్టి యీ తేదీల మధ్యను పుట్టినవారు కుంభ రాశియందు జన్మించిన వారుగా పరిగణింప బడుతున్నారు. దీనికి జన్మనక్షత్రంతో కాని, సమయంతో కాని నిమిత్తం లేదు.

8, 17, 26 తేదీల్లో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

**జనవరి :**

కొన్నివ్యవహారాల్లో యెవరినీ నమ్మడానికి అవకాశం లేదు. ఇదివరకు యేవో కారణాల వలన ఆగి పోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తి చేయగలరు. ఉద్యోగంలో మిత్రుల సలహాలను పాటించడం మంచిది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించ గలరు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ఫిబ్రవరి :**

ఇప్పుడు మీరుజరిపేవ్యవహారాల వల్లముందు ముందు ఉపయోగం ఉంటుంది, వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వ్యాపారంలో కార్యసాధన కోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా ప్రవర్తించవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మార్చి :**

వృత్తిలో శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించ గలరు. నూతన వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. సామాన్యమైన పనులకు కూడా విశేషమైన కృషి చేయవలసి వస్తుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తి కరంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సు కొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ఏప్రిల్ :**

వృత్తివ్యాపారాల్లో మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి కాని మీరు తాత్కాలిక ప్రేరేకాలకు లొంగిపోవడం వలన చేజిక్కిన అవకాశాలను కూడా కోల్పోయే ప్రమాదం ఉంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

**మే :**

వృత్తివ్యాపారాల్లో మీ అంచనాలు పరిపూర్ణమైనవి రుజువు కాగలవు. కాని వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఇతరులమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది.

**జూన్ :**

ప్రతివ్యవహారంలోను మీకు యేదో ఒక సందేహం కలుగుతుంది. కొంతమంది వ్యక్తులు మీ మంచితనాన్ని స్వప్రయోజనానికి వినియోగించుకొనడానికి ప్రయత్నిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. సంతానానికి అనారోగ్యం చేయవచ్చును. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి స్వల్పాటంకాలు వస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**జూలై :**

వ్యాపారంలో పోటీదారిపోటీని యెదుర్కొని అనుకూలతను సాధించ గలరు. వృత్తిలో యిదివరకు చేజారిపోయిన అవకాశాలు తిరిగి లభిస్తాయి. ఉద్యోగంలో మీరు చేసిన నిర్ణయాలు సరియైనవని రుజువు కాగలవు. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు. ఆరోగ్యం బాగా ఉంటుంది.

**ఆగస్టు :**

మీరు యెంతమాత్రము అజాగ్రత్తగా ఉన్నా, వృత్తిలో చికాకులు యేర్పడతాయి. కొంతమంది వ్యక్తులు మీకు అనుకూలమైన సలహాలను యిస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలెత్తగలవు. ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమను సహించ గలరు. అనవసరం కోసం వ్యయం అవుతుంది.

**సెప్టెంబరు :**

భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. కొన్ని వ్యవహారాల్లో అంచనాలు కలిగించే పరిస్థితులు యేర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మీకు మున్ముందు బాధ్యతను కలిగించే వాగ్దానాలు చేయడం తగదు. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. అనుకూలమైన వార్తలను వింటారు.

**అక్టోబరు :**

పూర్తిగా నెరవేరేవరకూ యే వ్యవహారాన్ని నమ్మడానికి అవకాశం లేదు. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో యిబ్బంది కలుగుతుంది. పోటీదారితో వాద ప్రతివాదాలు తగవు. నెలాఖరులో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. బహుమిత్రులను కల్సుకొంటారు.

**నవంబరు :**

మీ ఆత్మవిశ్వాసమే అన్ని వ్యవహారాల్లోనూ అనుకూలతను సాధించగలదు. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. మీరు వస్తువులు కొంటారు.

**డిశంబరు :**

ఇదివరకు మీకు కలిగిన సందేహాలు తొలగిపోతాయి. వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. పవిత్రమైన సాంగత్యం లభిస్తుంది.



హిప్పీలతో వాణిశ్రీ.

### గోవాలో వాణిశ్రీ!

నటి వాణిశ్రీ గోవా వెళ్లింది. అక్కడి ఆమె అనుభవాలను చెప్పింది.

గోవాలో హిప్పీలని చూసింది. వాళ్లు మనలాగా శరీరాన్ని దుస్తులతో కప్పుకోరు. మండుటెండలో యిసుకపై దిగులు లేకుండా పడుకుంటారు. మగవారు ఒక నిక్కరుతోనే వుంటారు. ఆడవాళ్లు నిక్కరు, బనియను ధరిస్తారు. కుళ్ళిపోయిన కప్పలను, చేపలను వండుకుని తినడం వాళ్లకు అలవాటు. వాళ్ల మనస్సు నిష్కల్మషంగా వుంటుంది. వాళ్లు పాములను చూడలేదట. 'మీరు మా ప్రదేశానికివస్తే పామును చూపిస్తాను' అని వాళ్లతో వాణిశ్రీ చెప్పింది.

ఒకరోజున వాణిశ్రీయే చేపలని వండి వాళ్లందరికీ వడ్డించింది.

—సంచారి.

# మీనం

ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 20వ తేదీనుంచి మార్చి 21వ తేదీ వరకు సాయన సూర్యుడు మీన రాశియందు ఉంటాడు. కాబట్టి యీ తేదిలను మధ్యను పుట్టినవారు మీనరాశియందు జన్మించిన వారుగా పరిగణింప బడుతున్నారు. దీనికి జన్మ నక్షత్రంతో కాని సమయంతో కాని నిమిత్తం లేదు.

8, 17, 26 తేదీల్లో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులు మొదటి నుంచీ శ్రద్ధగా చదవడం అవసరం.

**జనవరి :**

వృత్తివ్యాపారాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు సాధించ గలవు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ఫిబ్రవరి :**

వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన ముఖ్యమైన వ్యవహారాలను కూడా వాయిదా వేయవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. అధిక వ్యయం జరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

**మార్చి :**

ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. వృత్తివ్యాపారాల్లో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలమైన వార్తలను వింటారు. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ఏప్రిల్ :**

మీ మంచితనము కొన్ని వ్యవహారాల్లో అనుకూలతను సాధించ గలదు. మీకు యిష్టం లేకపోయినా, మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవలసి వస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాల్లో నూతన పరిచయాలు యేర్పడతాయి. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలించదు.

**మే :**

వృత్తివ్యాపారాల్లో యెన్ని అవకాశాలు కన్పిస్తాయి కాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. పోటి వారితో వాద ప్రతివాదాలు తగవు. శుభ మూలంగా వ్యయం జరుగుతుంది. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి.

**జూన్ :**

కొన్ని వ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా అది యితరులకు చెడుగానే కన్పిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించ గలరు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**జూలై :**

ప్రతి వ్యవహారంలోను మీకు యేదో ఒక సందేహం కలుగుతుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**ఆగస్టు :**

వ్యాపారంలో పోటి వారితో పోటీ పెరుగుతుంది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. వ్యాపారం భారీ యెత్తున చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ఉద్యోగంలో మీరు యిప్పుడు చేసే నిర్ణయాలలో ముస్ముందు ఇబ్బంది కలుగుతుంది. కోర్టు వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సెప్టెంబరు :**

వృత్తిలో పోటీవారిచే పై చేయి కాగలదు. వ్యాపారంలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆర్థిక వ్యవహారాల్లో చికాకులు కలగవచ్చును. ఉద్యోగంలో గౌరవం బాగానే ఉంటుంది. కాని పోటివారి అసూయకు గురి కాగలరు. కుటుంబ సంతోషం లభించగలదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

**అక్టోబరు :**

లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో చికాకులు యేర్పడతాయి. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీమీద దుష్ప్రచారం చేయగల ప్రమాదం ఉంది. ఉద్యోగంలో ముఖ్యమైన పనులు మీరు స్వయంగా చూడడం మంచిది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది.

**నవంబరు :**

వృత్తివ్యాపారాల్లో మీరు యిదివరకు కొన్ని వ్యవహారాలను నిర్లక్ష్యం చేయడం వలన యిప్పుడు యిబ్బంది కలుగుతుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు యిదివరకటి కంటే బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**డిశంబరు :**

ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది కాని ఫలితం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. అన్ని వ్యవహారాల్లోనూ గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. బంధువుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవలసి వస్తుంది. దైవకార్యాలు నెరవేరతాయి. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

— మహేష్ ●






### జరిగిన కథ

రాజ్యలక్ష్మమ్మగారి కొడుకు రాజశేఖరం అతనికి రాధతో వివాహమైంది. కాని, కొన్నాళ్ళకే ఆమె అందరికీ దూరమైపోయింది. రాజశేఖరం రాధ తలపుల్లో పిచ్చివాడైపోయాడు. భరించుకోలేక తనకి సాయంగా వుంటుందని రాధ చెల్లెలు మాధవిని రమ్మని రాసింది రాజ్యలక్ష్మమ్మ. రాజశేఖరానికి మాధవిలో రాధ కనిపించింది. అతనికి కొంత శాంతి కలిగింది. మాధవి అన్నగారు సారధి అతనికి అరుణతో పెళ్ళవుతుంది. మాధవిపై సారధి ఎక్కువ అనురాగం కనబరచడం అరుణకి ఇష్టముండేది కాదు. ఫలితంగా యిద్దరి మధ్య వివాదాలు వస్తుండేవి. శ్రీకాంత్ తనని ప్రేమించాడని మాధవికి తెలుసు. కాని, అనురాధ మనసు తెలిసిన మాధవి తనమీద ఆశలుపెట్టుకోవద్దని శ్రీకాంత్‌కి చెప్పేస్తుంది.

# 11

శ్రీకాంత్ మాధవికీ, తనకూ జరిగిన సంభాషణ మరొకరికి తెలియనీయలేదు.

కాని అనూరాధ 'మాధవి' ఏదో పెద్ద త్యాగమే చేసిందని గ్రహించింది. వెళ్ళేముందు శ్రీకాంత్‌ను, అతని తల్లిని అడిగింది.

'ఏం నాయనా? అనూరాధ గుంటూరు వెళ్తుందట! మామయ్యకేమని చెప్పమంటావు?'

ఏదో వ్రాసుకుంటూన్న శ్రీకాంత్, తల్లిమాటవిని తలెత్తాడు. కాని జవాబు చెప్పనేలే దెంతసేపటికీ.

'ఈ నెలలో ముహూర్తాలున్నాయి నాయనా! ఏదో ఒక లగ్నం నిర్ణయించమని వ్రాస్తున్నాను మామయ్యకు' ఆమే అన్నది తిరిగి.

'నీ యిష్టం! నాకేమీ తెలియదమ్మా! నీమాట కాదనలేను!' అన్నాడు తలవంచుకుని.

ఆమాట విన్న అనూరాధ హృదయాన మల్లెలు విరిశాయి. కనులలో మధుర భావాలు కలలు నల్లుకోసాగాయి. కాని ఆ మధురిమకు తీయదనాన్నందించిన వ్యక్తి నిశ్శబ్దంలో విలీనమైపోయాడు. కనీసం ఒక్కసారైనా తలఎత్తి తన జీవిత సహచరిణి వంకమాడలేదు. ఆ అనురాగమయి మనస్సు చిన్నబోయింది. విరిసిన మెరుపులే అదృశ్యమై పోయాయి మరుక్షణంలోనే.

ఎంతసేపు నిల్చున్నా కదలికేలేద తనిలో—చేతిలోవున్న కలం కదులుతోంది. ఉండి వుండి కనుబొమలు ముడిపడుతున్నాయి. కాని అంతకన్నా మరో శబ్దమేలేదా వైపునుంచి. అలాడినే చూస్తూన్న అనూరాధకు విసుగు జనించింది. అక్కడే వున్న కుర్చీ గుమ్మవలికి లాగి మరీ కూర్చుంది శబ్దం చేస్తూ.

అప్పటికీ లేవనే లేదాతని తల—రవ్వంతైనా కుతూహలం చూపలేదంత శబ్దం విన్పించినా. అభిమానం తారాజువ్వలా ఎగసి పడిందామెలో'

'స్టేషన్‌కి అత్తయ్యను తీసికొని వెళ్తున్నాను' అన్నది.

'అలాగే' అన్నాడు తనకేమీ పట్టనట్లు ఆమె వైపు చూడకుండానే.

'నువ్వుకూడా రారాదా! బాబూ! సరదాగా వుంటుంది!'

'నాకిప్పుడు 'టైమ్' లేదమ్మా! మన రాముణ్ణి తీసికెళ్ళండి. టికెట్ కొని తెస్తాడు.' అన్నాడు.

అనూరాధకా యింటికి ఎందుకు వచ్చానా అన్పించింది. ముఖాన వున్న ఆనందం తుర్రుమని పారిపోయింది.

తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అన్నది.

'ఎవరూ అక్కర్లేదు! నాకేమన్నా భయమా? పిల్లి ఎత్తుకు పోతుందా? యింతలోనే'

ఆమెకు కోపం వచ్చిందని గ్రహించిందా యింటి యిల్లాలు! అందుకే మేన కోడల్ని దగ్గరకు తీసుకొని తల నిమురుతూ అన్నది వాత్సల్యం తొణికిసలాడుతూన్న స్వరంతో.

'వాడిసంగతి నీకు తెలుసుగదమ్మా! మనస్సులో మరోవిధంగా అనుకోకు. ఏదో బాధ రగులుతోంది శ్రీకాంతుడిలో. పైకి చెప్పలేక విలవిలలాడి పోతున్నాడు. అంతే! చిన్నప్పుడూ చిన్నబుచ్చడు. ఈ నీ ముసలి అత్తయ్య ముఖంచూసి అయినా శ్రీకాంతుణ్ణి వేరుగా చూసి మనస్సు పాడు చేసుకోవద్దు తల్లీ!

ఈ యిల్లు మీ యిద్దరిదీ! ఈ గుండెల్లో పొంగుతూన్న అనురాగం మీ యిద్దరిదే! వేరై నన్ను బాధపెట్టవద్దమ్మా! భరించలేదీ ఎముకలగూడు'

'అత్తయ్యా!' అని ఆమె కెంతో విపులంగా చెప్పుకోవాలన్నంతగా తహతహలాడిపోయిందామె మనస్సు. ఆ మాతృత్వమూర్తి ఒడిలో తలదాచుకుని 'బావ మనస్సు నాదికాదేమో?' అని లోన దాగిన అనుమానాన్ని వెల్లడి చేయాలని వ్యూగిపోయింది. ఆ చేతులలో ప్రవహించుతూన్న ఆత్మీయానురాగాలామెను ఒక్క అక్షరమైనా మాట్లాడనీయలేదు. ఆమె భుజం మీద తలవాల్చి అశ్రు పూర్ణనయనాలను వత్తుకుంది మౌనంగా.

మాధవిగురించి చెబుదామనుకుంది. కానీ ఆ ఆవేగంతో నోటమాటే రాకుండా పోయిందెంత ప్రయత్నించినా. స్టేషన్‌కి వెళ్ళేముందు మాధవికి 'ఫోన్' చేసింది. 'మీ బావ ఏమన్నాడని' ప్రశ్నించిందామె. క్షణమాత్రం ఏకాంతంగా వుండిపోయింది ఏమని జవాబు చెప్పాలో తెలియక. తరువాత అన్నది—

'బలవంతంగా ఎవరో బావ యిష్టాయిష్టాల్ని శాసించా లనుకుంటాను.'

'తర్వాత ఉత్తరంలో వ్రాస్తానులే అనూ! జరిగిన సంగతులన్నీ?' అన్నది మాధవి 'ఫోను' పెట్టేస్తూ.

అనూరాధ వెళ్ళిపోయిన తర్వాత పెద్దవాన కురిసి వెలిసినట్లు ప్రశాంతత అలుముకుంది ప్ర కాంత్ హృదయ మందిరాన.

మాధవి మాటలే మనస్సున మెదులుతున్నాయి. ఆ మధురానురాగమయి హృదయాన దాగినదెంత రహస్యమో అర్థం గాకుండా పోయిందతనికి. ఆతనిపై అనురాగమున్నదీ లేనిదీ తెలియడంలేదు.

కానీ తన చిత్రం 'ఊహాసుందరి'ని చూసినపు డామె కనులలో మెరిసిన మెరుపులో అనురాగం తళుక్కుమంది. ఆ మెరుపు మరపుకురావడం లేదతనికి.

అతడు ఆత్మీయంగా తన యింటికి ఆహ్వానించినపుడు కాదని తిరస్కరించలేదు. వచ్చిన తరువాత చిత్రాలను చూసి ఆనందంతో 'పులకించి పోయిందామె హృదయం. 'మరెందుకీ తిరస్కృతి ?! అనూరాధకోసమేనా ?! ఆ యిరువురి మధ్యా అల్లుకున్న స్నేహలతకోసమేనా?' ఆలోచనలు, అనుమానాలు కొల్లలయ్యాయి.

స్టేషన్‌నుంచి వచ్చినతర్వాత తల్లి అన్నది—

'అనూ ఎంతో బాధపడింది బాబూ! మళ్ళా రానన్నావని'

అతడేమీ మాట్లాడలేదు. తల్లి అతని మౌనాన్ని గమనించి సమాధానం చెప్పడం యిష్టంలేదని గ్రహించింది. మళ్ళీ మరోమాట మాట్లాడకుండా తన పనుల్లో లీనమైపోయింది.

* * *

మాధవి స్కూల్లో వున్నపుడు 'ఎవరో విజిటర్స్ వచ్చారు 'టీచర్! మీకోసం' అని ఓ విద్యార్థిని చెప్పింది. పేరుల్లో



దిద్దుకుంటోందామె. వాటిని కట్టగట్టి లేచివెళ్ళింది. ఆమె వూహ యదార్థమైంది. వచ్చినవ్యక్తి శ్రీకాంతుడే !!

మాధవి వచ్చినట్లు గమనించీ గమనించనట్లు కిటికీలోనుంచి బయటకు చూస్తూండి పోయాడు.

'మరోచిత్రానికి మనస్సున 'ప్లాను' వేసుకుంటున్నా రనుకుంటాను !' అన్నది మాధవి మృదుమధుర స్వరంతో.

తల త్రిప్పకుండానే అన్నాడు—

'నేయమని మీరేగా ఆజ్ఞాపించారు?!' ఆ కంఠాన బాధకెరటంలా లేచిపడింది.

అతనివంకే చూస్తూండి పోయింది మాధవి. ఎంతోసేపటికి నోరువిప్పింది—

'ఆజ్ఞాపించడం యింకా తెలియదీ మాధవికి !'

'అవును. నిజమే, అంతటి అదృష్టం ఎవరిదో ?' నిట్టూర్చాడు సోఫాలో కూర్చుంటూ.

ఆమె కనులలో ఏదోభావం తళుక్కున మెరిసిపోయిందా క్షణంలోనే. నవ్వుతూ అన్నది—

'మీలో కూడా అసూయ వుందన్నమాట !'

'ఏం ? వుండగూడదా ? మనిషిని గానా ? నేను !?'

'ఊహూ ! మీరు మనుష్యులుగారు !'

'మరేమిటి ? రాక్షసుణ్ణా !'

'కాదు !'

## మనుషులూ...

'భూతాన్నా ?! దెయ్యాన్నా ? పిశాచా...'

'అన్నింటినీ సృష్టించే కళామూర్తులు !?'

నివ్వెరపోయాడతడు. ఆమెవంకే చూస్తూండి పోయాడు మంత్రించిన విగ్రహంలా.

'ఈ నీ ఆత్మసౌందర్యాన్ని చూసే అనురాగాన్ని అల్లుకున్నాను ! మాధవీ ! మనుషుల్లో దేవతవు ! నువ్వు ! వుహూ ! దేవతల్లో రత్నానివి ! ఆణిముత్యానివి. నీ మనస్సు మధురానురాగ వీణియ ! నిన్ను...నిన్ను...అందుకోలేను? అంత వున్నతంగా వూహించకు నన్ను... అలాగే...దేవతలా — నిలిచిపో ! ఊహా శ్రీకాంతుడి కలల్లో !' ఆక్రోశించిందతని హృదయం.

వరాసంగా చేతిలోనున్న పుస్తకంనుంచి ఓ కార్డుతీసి ఆమె కందించాడు.

'అనూరాధా శ్రీకాంతుల జీవితాలను ఏకంచేస్తే శుభలేఖ అది !'

మాధవి వదనాన ఆనంద రేఖలు విప్పారాయి. మందహాసంచేస్తూ అన్నది—

'బావుంది! అందంగా అచ్చు వేయించారు? ఎంతైనా కళాహృదయులు?'

'అమ్మ మిమ్మల్ని రెండు రోజులు ముందే రమ్మంది' అన్నాడు.

'ఏం? ఇంకా ముందు రాగూడదా?' దాచుకుంటూన్న నవ్వు పెదవులపై నృత్యం చేస్తోంది.

'అని షరతు లేదు! ఆ యింటి తలుపులు ఎల్లప్పుడూ తెరిచే వుంటాయి మీ కోసం.'

ఆమె పరిహాసాలతో ఆడుకుంటోంది. అతడు ప్రతిమాటలోనూ, ప్రతి అక్షరంలోనూ మనస్సువుంచి మాట్లాడుతున్నాడు. పోగొట్టుకున్న పెన్నిధిని వెతుక్కుంటున్నాడు ఆశగా.

'రాత్రి పూట మాత్రం అలా వుంచేయకండి! దొంగలున్నారిక్కడ!'

'దోచుకోవాలనే అన్పించుతోంది! సర్వస్వాన్ని!'

'ఏమిటండోయ్! అంత ధర్మరాజులై పోయారు?' నవ్విందామె.

'ధర్మరాజునైనా లాభంలేదు! ఏ రాజునైనా నష్టం వుంది!'

'అబ్బ! ఏమిటో! మీ మాటలు నాకు అర్థం గావటంలేదండీ!'

'అబద్ధం! నిజం చెప్పండి! మీరు నన్ను ప్రేమిస్తున్నారా ? లేదా? నా ఊహా ఒక్క మాటకు సమాధానం చెప్పండి! చాలు!' ఆవేదన సుడులు తిరుగుతోందాతని కంఠాన.

'కొన్ని ప్రశ్నలకు సమాధానాలు దొరకవు! అయినా నిజం తెలుసుకుని ఏం చేద్దామని?'

'ఆ నిజంతో మిమ్మల్ని బంధించుతానని భయపడుతున్నారా? మాధవి? మరీ అంత మూర్ఖుణ్ణిగామలెండి! నిజం వింటే నా ఊహా మండుతూన్న హృదయానికి కొంచెం తృప్తి లభిస్తుందని ఆశ.'

'మీకు తెలియదేమో! కొన్ని నిజాలు వూహల్లోనూ, అనుమానంలోనూ తృప్తినందించుతాయి. తెలిసికొంటే మరింత వేధించుతాయి.' అన్నదామె.

'ఆ ఆవేదనే తీయని మంటలా హాయిగా వుంటుంది! చెప్పండి!'

'మీరింత పట్టుదల మనుషులని నేనెపుడూ అనుకోలేదు ! మీకెందుకంత పెద్ద అనుమానం వచ్చింది?... నిజమే... ప్రేమించుతున్నాను మిమ్మల్ని...ఓ స్నేహితుడిగా,' యదార్థాన్ని వెల్లడించింది.

బరువైన నిట్టూర్పు వినవచ్చిందతని



మీ పాపని
జలుబుతో
బాధపడనిస్తారా?

అక్కరలేదు !

**విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది. ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.**

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయడమే — ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:




బయట-చర్మం మీద — లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది. హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చిన ప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

### ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




516G

## విక్స్ వేపొరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం

వడిందామె.

'ప్రిన్సిపాల్', నడిగి నాలుగు రోజులు సెలవుతీసుకుంది. వెళ్ళే ముందు శ్రీకాంతునికి 'ఫోన్,' చేసింది సంగతి తెలియచేస్తూ. 'వివాహానికి వచ్చేయండి' అన్నాడతడు.

'ఏమో! చెప్పలేను! అన్నయ్య ఉత్తరం వ్రాయకుండా వుండడు. ఎలావున్నాయో అక్కడి పరిస్థితులు? సెలవిచ్చితే తప్పక వస్తాను. రాకపోతే 'అనూ' యింకా జన్మలో నా ముఖం చూడదు' అన్నదామె

'అనూరాధే గుర్తుంటుంది మీకు! ఈ శ్రీకాంత్ ఏమీగాడుగా?' నిష్ఠూరం ధ్వనించింది!

'ఏమీ ఎందుకుగాదండోయ్?! నా ప్రాణంలో ప్రాణమైన అనూకి శ్రీవారేగా! అందుకేగా 'ఫోను'చేసి మరీ చెబుతున్నది. అయినా ఆడవాళ్ళలా అలా నిష్ఠూరంగా మాట్లాడితే వూరుకోను' అన్నాడి నవ్వుతూ.

'మీ శిక్ష మాటల్లోనే లెండి! అందుకే 'అనూరాధ'కి మీరంటే అంతయిష్టం!'

'ఎంత? పుట్టెడా? మరోసారి చెరిగా 'కొయిద్దాంలెండ' మనుకొన్నాన్ని. రైలుకు టైమయిపోతోంది మరి... వుంటానిక... అమ్మగారికూడా చెప్పండి' ఫోను పెట్టేసిందామె.

ఆ సాయంత్రమే 'పల్లె'కు బయల్దేరింది. స్టేషన్లో దిగగానే గుర్రపుబండి కట్టించుకుని యిల్లుచేరేవర కామెలో ఆతురత కొండలా పెరిగిపోతూనే వుంది.

అరుణ, బాబునెత్తుకుని ఎదురొచ్చింది చిరునవ్వు లొలకబోస్తూ చిందులు వేస్తున్నాడు. మాధవి హృదయాన ఆనందం తాండవ మాడిందా పసిపాపడిని చూడగానే. నవ్వుతూ బాబును తీసికొని లోనికి వెళ్ళింది అరుణను పరామర్శించుతూ, పసివాణ్ణి ముద్దులాడుతూ.

'అన్నయ్యేడి? వదినా! తోటలో వున్నాడా!' అన్నది మధ్యలో.

'ఏమో? నేనెవర్ని! ఫలానా చోటికి వెళ్తున్నానని చెప్పడానికి?' నివ్వెరపోయింది మాధవి ఆ జవాబు వినగానే. ఆశ్చర్యం చిందులు వేస్తూండగా అన్నది—

'ఊళ్ళో వున్నాడా? అసలు!'

'ఎవరికి తెలుసుతల్లీ! ఎక్కడే వున్నాడో! వూరుదాటి వెళ్ళాడో! పనిలేని మంగలి పిల్లితల గొరిగాట్ట! అలాగే...'

'అత్తయ్యా!' కామాక్షమ్మ ఆ అరుపుతో హడిలి తక్కున నోరు మూసింది.

ఆలెక్కోపం మాధవినెప్పుడూ ఆవేశించ లేదు. కంఠాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ అన్నది వెంటనే—

'పేనుకి పెత్తనమిస్తే తెల్లవార్లూ తెగకొరికిందన్నట్లు, చుట్టమై చూడ వచ్చి దయ్యమై కూర్చుందన్నట్లు— అని నేనంటే ఏం చేస్తారు?'

ఆగ్రహం రాజుతూనే వుంది లోలోన.

'ఏంచేస్తాం తల్లీ! గతిలేనప్పుడు గంజేపానకం! అయినా నాకర్మ గాకపోతే నాకేందుకీ వెట్టిచాకిరి? హాయిగా కాలుమీద కాలు వేసుకుని కూర్చుని మహారాణిగా జరిపించుకోక! నాయిల్లు వదిలి వచ్చిననాడే అనుకున్నాను...ఈ వెధవ కొంపలోనా— నా తల్లి —అరుణ కాపురం చేయవలసింది...అని'

'మీకు తెలియదేమో! కొంపలేగాదు వెధవలు? మనుషుల్లోనూ వున్నారు ఆ రకం! అందుకే మీరూ, నేనూ యింతబాధ పడ్పడింది.' కించిత్తయినా క్రోధంలేదామె స్వరంలో.

ఆ వ్యంగ్యోక్తి నిప్పురవ్వలా చురుక్కుమంది. కామాక్షమ్మ తెరిచిన నోరు తెరిచినట్టే వుండిపోయింది.

ఆ పైన మరోమాట మాట్లాడకుండా ప్రక్కయింటికి వెళ్ళింది మాధవి. ఆ యింటి మామ్మగారు మాధవిని కన్న బిడ్డలా చూసుకుంటుంది. అందుకే అన్నను గురించి తెలుసుకోవాలన్న వూహతో వెళ్ళి అడిగింది.

ఆమె చెప్పినది వింటూంటే మతి పోతోంది—

'ఏం చెప్పమంటావుతల్లీ! లక్ష్మిలా నువ్వున్నన్నాళ్ళూ యిల్లు కళ కళ లాడింది. మహాతల్లి, ఆ కామాక్షమ్మ ఏనాడు అడుగుపెట్టిందోగాని కొండను గుల్లజేస్తోంది—

సారధికి కోపమేగానీ, ఏమీ తెలియదమ్మా! నువ్వేమో నెలనెలా డబ్బు పంపించుతున్నావా? అందగానే అరుణ

# మనుషులూ...

లాక్కుంటుంది చీరలనీ, సారెలనీ, మందులకనీ, మాకులకనీ. అక్కడనుంచి కామాక్షమ్మతల్లి అందుకుని పుట్టింటికి చేరవేస్తుంది.

ఇదీకథ! పైగా యింట్లో నిలవనీయదు! ఆ మధ్య నీ కోసం ఎవరో పెళ్ళివాళ్ళు వచ్చారు. తోట అమ్మి కట్నం యిస్తానన్నాడు సారధి! ఇక చూడుతల్లీ! ఆ వచ్చిన వాళ్ళని వాకిట్లోనేవుంచి మీ అన్నయ్యను దులిపివేశారు. నానా మాట అన్నారనుకో! పాపం! మానవుడు పైవాళ్ళు వున్నారని తలవంచుకుని వెళ్ళిపోయాడు—'

వినడమేగానీ అడ్డురావాలన్న మనస్కరించలేదు మాధవికి.

'ఓ తోట అమ్మించారు మొన్న నీ మధ్యే! నీపెళ్ళి చేయాలంటూ. తీరా డబ్బు చేతిలోపడగానే గొలుసు చేయించుకుంది అరుణ. అప్పుకూడా తీర్చకుండా ఆరాటంతో అమ్మిన మీ అన్నయ్యకే పని ఎలా నచ్చుతుంది! పోట్లాడాడెంతగానో. కాని ఆ భూతాలతో ఎవరు గెలుస్తారే నా తల్లీ!

అన్నలవాళ్ళ పరువు తీసేస్తున్నారని రెండోతోటా అమ్మివేశాడు. సర్వం శూన్యమైంది. సర్వమంగళం పాడించారు అమ్మా కూతుళ్ళిద్దరూ ఏకమై. ఏమైనాసరే నీ పెళ్ళి జరగనీయరట. నీ సొమ్ము మాత్రం దాచుకుని తింటారట. ఇలా వుందమ్మా! మీ యింటి గొడవ! మీ అమ్మపోయింతే ఎంతబాధ పడిపోయిందో— ఎంత విలవిల లాడిపోయేవో మీ అన్నయ్యను




చూసి సారధి పుల్లలా అయిపోయాడమ్మా! చూస్తుంటే కడుపు తరుక్కుపోతోంది. బిడ్డ! ఎంత మంచివాడు! పన్నెత్తి మాట్లాడడు గదా! నోరువిప్పి మరొకరికి చెప్పుకోడు గదా! ఏమిటో తల్లీ! ఎలా భరించుతున్నాడో ఆ కుంపటిని? ఆ భగవంతుడికే తెలియాలి.'

మాధవి నిర్ఘాంతపోయింది. బొమ్మలా కదలకుండా కూర్చుండిపోయింది. విన్నదంతా తల్చితే ఎంతో బాధనిపించుతోంది. వినరానిదేదో విన్నట్టు బాధంతా విప్పించుకున్నట్లు, కొండంత బరువు మోస్తున్నట్లుందామెకు.

'అయితే అన్నయ్య ఆరోగ్యం కూడా పాడైపోయిందా మామ్మా!' ఆ ప్రశ్న బొంగరంలా తిరుగుతుంది మనస్సులో.

'ఇంకా అనుమానమెందుకే పిచ్చిదానా! ఎలా అన్నయ్యను మనిషిగా జేస్తావోగాని యిప్పుడు జాగ్రత్త గుండెలు బాదుకుంటావు. ఏమిటో మరి! పని! ప్రతి రోజూ పట్టణం వెళ్ళి వస్తున్నాడు. ఎవరికీ అక్షరమైనా చెప్పడు గదా! ఇదిగో! అమ్మా! మాధవీ! ఎలాగైనా ఆ కామాక్షమ్మను యీ యింటినుంచి పంపించు. మీ యిల్లేగాదు — వూరు కూడా బాగుపడుతుంది.

తనో! ఎంతమందితో పోట్లాడిందని చెప్పను? ఎన్ని జగడాలు సృష్టించిందని చెప్పను? జుట్టూ జుట్టూ ముడివేసి చోద్యం చూస్తుందేమిటమ్మాయ్?! ఆ తల్లికి వంత పాడుతుంది మీ వదిన. కొంపని కురుక్షేత్రం చేశారనుకో!'

మాధవి కివన్నీ వినిపించడమేలేదు. చెవుల్లో 'అన్న పట్టణం వెళుతున్నాడు! పుల్లలా అయిపోయాడు' అన్న మాటలే ప్రతిధ్వనించుతున్నాయి.

ఇంకా ఆమె చెబుతూనే వుంది. మాధవి లేచి నిలబడింది.

'వస్తాను మామ్మా!' అంటూ బయల్దేరింది.

'ఇవన్నీ నేను చెప్పానని అనకే తల్లీ! నా గొంతు నొక్కేస్తుంది కామాక్షమ్మ!' అరిచిందామె.

ఆ మాట కూడా వినేటంత వేగంగా వెళ్ళిపోయింది మాధవి. ( ఇంకా వుంది )




భగవంతుడి అనుగ్రహం తమకు లభించాలని అందరూ కోరుతారు. అందర్నీ అనుగ్రహించ వలసిందని — సర్వేజనాః సుఖినో భవంతు అని—మనమూ దేవుణ్ణి ప్రార్థిస్తాము.

అయితే అందర్నీ దేవుడు కృపతో చూస్తున్నాడా? అని చూస్తే — అలా జరుగుతున్నట్లు లేదు.

ఆయన అనుగ్రహానికి పాత్రులయిన వారూ ఉన్నారు, కాని వారూ ఉన్నారు.

దీనికి కారణ మేమిటి?

కొంచెం ఆలోచిస్తే కారణమూ తెలుస్తుంది.

* * *

ఒక ధనవంతుడికి ఒక పూలతోట ఉన్నది. దాని సంరక్షణకోసం ఆయన ఇద్దరు తోటమాలీలను నియమించాడు. ఆ మాలీలలో ఒకడు సోమరిపోతు. పని చెయ్యకుండా ఎగవెయ్యడానికి ఎన్ని ఉపాయాలున్నాయో అన్నీ వాడికి తెలుసును. రెండవవాడు కష్టపడి పనిచేస్తాడు. ఒక్క క్షణమూ వృధా పోనివ్వడు. తోట కలకల లాడుతూ అభివృద్ధికి వచ్చిందంటే—దానికి అతడే కారణం!

తోటను చూడడానికి యజమాని అప్పుడప్పుడు వస్తూవుంటాడు. ఆ అదూకే కనిపెట్టి సోమరిఅయిన మొదటి కూలీ ఆయనకు ఎదురుగాపోయి చేతులు జోడించి 'శ్రమపడి ప్రభువులే దయ చెయ్యాలా? ఏమికావాలో కబురు పంపిస్తే వెంటనే తెచ్చి ప్రభువులకు సమర్పించనా?' అని అంటూ యజమాని తోటలో ఉన్నంతసేపూ చేతులు కట్టుకుని ఆయన వెనకాలే ఉంటాడు.

రెండవ వాడు అలా కాదు. తన పనియేమో, తానేమో! ఎప్పుడూ తాను చెయ్యవలసిన పనిలోనే మునిగివుంటాడు. యజమాని తోటలోకి వచ్చిన సంగతి తెలిసినా, అతనిని చూడడానికి వెళ్ళడు. ఆయన తాను ఉన్నవైపు వస్తేమాత్రం నిలబడి నమస్కరించి, తాను ఏమి చేస్తున్నదీ, తోట అభివృద్ధికి యింకా ఏమి చెయ్యవలసినదీ తెలుపుతాడు. ముఖస్తుతిగా ఒక్కమాట అయినా అనడు.

యజమాని కుశాగ్రబుద్ధి. పరోక్షంలోకూడా ఏమి జరుగుతున్నదీ గ్రహించే వ్యక్తి. ఆయనకు ఈ యిద్దరిలోనూ ఎవరిమీద ఎక్కువ అభిమానంవుంటుంది? రెండవ కూలీమీదే మాత్రమే వుంటుందని మీరు సులభంగానే గ్రహించగలరు.

భగవంతుడే తోట యజమాని అనుకుందాం.

ఆయన తోటమాలీలయిన జనుల్లో రెండురకాల వాళ్ళు ఉన్నారు. కొందరు అదేపనిపెట్టుకుని భగవంతుని స్తోత్ర పాఠాలు చదువుతూ, నిత్యమూ దేవాలయానికి పోయి పూజలు కళ్ళారా చూస్తూ నైవేద్యం పెట్టిన ప్రసాదాన్ని భక్తితో స్వీకరిస్తూ వుంటారు. మరికొందరు తోటలోని మొక్కల మాదిరిగా వుండే అనాథులూ, అంగవికలులూ. మొదలైన వారి సేవలో నిమగ్నులయి ఉంటారు. భగవంతుని సంతానం మాదిరిగా వాళ్ళను చూస్తూ కావలసిన సహాయం చేస్తూ వుంటారు.

భగవంతుడికి ఈ రెండురకాల మనుష్యులలో ఎవరిపైనా ఎక్కువ కృప ఉంటుంది?

సోమరిపోతుల్లా ఒక చోటనే వుండి, కేవలం తన్ను స్తోత్రం చేస్తూ — దానితోనే తమ విహితకృత్యం తీరిపోయిందని తలిచేవారిమీద దేవునికి కృప ఉండదు.

ప్రజాసేవ పరమార్థంగా పెట్టుకుని తద్రూపంగా తన్ను ఆరాధిస్తున్నవారిమీదే ఆయనకు ఎక్కువ కృప ఉంటుంది. ●



# వెలుగా రేకలి

అంబటిపూడి కమలాదేవి



'సరూ' రావడం ఎంత ఆశ్చర్యమని పించిందో, ఆమె తెచ్చినవార్త అంత కంటే ఆశ్చర్యమనిపించింది.

'శేఖరం పెళ్ళి చేసుకోబోతున్నాడట!' అవును మనిషన్నవాడు పెళ్ళిచేసుకుంటాడు, పిల్లల్ని కంటాడు. అందులో ఏమీ ఆశ్చర్యంలేదు. మనిషి పుట్టడం చావడం ఎంత సహజంగా జరిగిపోతూ వుంటాయో అదీ అలాంటిదే. కాని శేఖరం విషయంలో 'పెళ్ళి' అనేది కొంచెం ఆలోచింపజేసే విషయమే.

'పెళ్ళయితే నీతోటే... బ్రతుకుంటే నీతోటే...నువు లేకపోతే నేనులేను.'

అనేవాడు శేఖరం, ఒకసారి కాదు, లక్షసార్లు, పాడిందేపాటగా, అరిగిపోయిన గ్రామఫోను రికార్డులా.

మరి ఇప్పుడు?

అతని పెళ్ళిట?

అతనికి నేనులేను...కాని నేను లేక పోయినంత మాత్రాన అతనికతను లేక పోలేదు. అతనూ వున్నాడు, నేనూ వున్నాను.

దూరదూరంగా ... అందని తీరాలలో. అతనన్న మాటల్లో అర్థమున్నా లేక పోయినా, అతనిమాట నిలిచింది. అది నా మనోఫలకం మీదనుంచి చెరగదు. ఆ ముద్ర చెరిగేదికాదు. నీళ్ళమీద రాతలా అతని మాటమాత్రం విలువ పోగొట్టుకొంది.

కావాలని దగ్గరకొచ్చి, మురిపించి ఆశలు రేకెత్తించి-తీరా గాలివాన ఆరంభ మయ్యాక నట్టనడి సముద్రాన వదిలి పారిపోయిన హిడిమేమనాలి?

అతన్ని ఏమనడానికీ నాకు రాదు. ఇప్పటికీ నాకతను ఆరాధ్య దైవమే! నన్నూ నా ఆశల్నీ బుగ్గి చేసిన అతని మీద నాకింకా అభిమానమే వుంది. అదే నా బలహీనత. బహుశా ఈ బలహీన తనే అతను బాగా వుపయోగించుకుని వుంటాడు. నాలోనే గనక మనోబలం వున్నట్టయితే అతనెందు కంత దగ్గరగా రాగలుగుతాడు? దగా ఎలా చెయగలుగుతాడు?

'వచ్చి ఎంతసేపయిందో తెలుసా? ఆత్మారాముడి ఘోష భరించుకోలేకుండా వున్నాను. కాస్త కాఫీ నీళ్ళయినా పోసేది వుందా లేదా?'

అంది సరోజ నన్ను కదుపుతూ.

ఆమె తెచ్చిన వార్త నన్ను వెనక్కి లాక్కుపోయింది. సరోజకి అతిథి మర్యాదలే మరచిపోయాను.

'సారీ సరూ...రాకూర్చో...క్షణంలో

కాఫీ చేసిస్తా"

అన్నాను కొంచెం అపాలజిటిక్‌గానే.

వొంచిన నాతలను చుబుకం పుచ్చుకుని ఎత్తింది సరూ...! కిల కిల మంటూ నవ్వేసింది నా ముఖంలోకి చూస్తూ.

సరోజది ఎంత మంచి జీవితం? ఆమెకు కష్టమనేది వుండదు. వచ్చినా, అంతగా పట్టించుకోదు. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ వుండే స్వభావం, అలాంటి జీవితం ఏ కొద్ది మందికో తప్ప దొరకదు. ఎంతో పుణ్యం చేసుకుంటేగాని సరోజలాంటి జీవితం లభించదు. అందుకే సరోజ అంటే నాకంత ఇష్టం!

'వద్దులే రాధా... ఇపుడు నువ్వు కాఫీ ప్రయత్నాలేమీ చెయ్యొద్దు. నేను దారిలో తాగొచ్చా. ఇప్పుడు నువ్వేమీ అనవసరంగా బాధ పడక్కర్లేదు. అయినా. నాదే తప్పనుకో ... వస్తూ వస్తూనే వేరే విషయాలేమీ లేనట్టు శేఖరం గురించే చెప్పడం యేమిటి? పాపం...నువ్వెంత బాధ పడుతున్నావో ఏమో! నీ మనసు తెలిసున్నా, ఏదో నోరు జారి పోయింది నన్ను క్షమించు రాధా...

అంది, నా చేతులు పట్టుకొని సరోజ.

ఎందుకో నాకు కళ్లంట నీళ్లొచ్చేశాయి. ఆమె నాపై సానుభూతి చూపినందుకు కావచ్చు, లేదా శేఖరం జ్ఞాపకానికి వచ్చినందుకు కావచ్చు, లేదా రెండూ కావచ్చు.

సరోజ నా కళ్లు తుడుస్తుంటే ఆమె మీద ఎనలేని ప్రేమ పుట్టుకొచ్చింది. గట్టిగా కావలించుకున్నాను. అప్పుడు మరీ ఏడుపు వచ్చేసింది.

సరోజకి తెలుసు, నేనెంత తొందరగా ఏడ్చేస్తానో అంత ఆలస్యంగా తేరుకుంటానని. కాని, నా మనస్తత్వం పూర్తిగా ఎరిగున్న సరోజకి నాచేత నవ్వించడం పెద్ద కష్టమేమీ కాలేదు.

సరోజ దగ్గర ఏ మాయా మహత్యముందోగాని ఆమె మాటలు వింటూనే మంత్రముగ్ధనైపోతాను. సరోజ అప్పటికీ ఇప్పటికీ ఏం మారలేదు.

* * *

నాన్నకి అవసాన కాలం. పనిచేసే వోపికలేదు. అమ్మ రోగిష్టిది. వున్న ఆస్తి కాస్తా అమ్మ మందులకి, అన్నయ్య తిరుగుళ్లకి హారతి కర్పూరంలా హరించుకుపోయింది. అన్నయ్య ఇంట్లోంచి పారిపోయాడు వున్న కాస్తా చేజిక్కించుకుని. చదువులోవున్న గౌరవ మర్యాదలు నాన్నకి బాగాతెలుసు. అందుకే నేను ఆడపిల్లనయినా డిగ్రీ తీసుకునే వరకూ చదివించారు. అమ్మ నాన్నల సంగతి అన్నయ్యకు పట్టలేదు. అందుకే వాడిదారి వాడు చూసుకున్నాడు. చదువయిం తర్వాత నేను గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడం తప్పితే చేయగల్గిందేమీ లేకపోయింది. నాన్న కన్నుమూశాక యింట్లో పరిస్థితి మరీ అగమ్యగోచరంగా కన్పించేది. ఒక్కోరోజు తినడానికే వుండేదికాదు.

అమ్మ కన్నుమూయదట! నా పెళ్లి చూసేవరకూ ఆమె ఎన్నాళ్ళయినా అలాగే బ్రతుకుతుందిట! అందుకే నేను పెళ్లి చేసుకోకూడదనుకున్నాను. వున్న పెద్ద దిక్కు ఆ వొక్క అమ్మకూడా పోతే నా బ్రతుకేం కాను? వున్నరోజుల్లో చుట్ట పక్కాలంతా ఈగల్లా ముసిరారు. అంతా హరించుకు పోయిందిగా, ఇప్పుడు మేమంటూ వున్నామో లేమో ఎవరికీ అక్కరలేదు. నేనే మొగపిల్లవాడినై వుంటే ఎలా వుండేదో? నాకోసం కొంత మంది కాకపోతే కొంత మందయినా కాచుకు కూర్చునేవారు. ఆడదాన్నయి పోయానయ్యే...మా యింట్లోకి ఎవరు తొంగి చూసినా వారికి నాభారం అంటగట్టడానికి అమ్మసిద్ధంగా వుండయ్యే. అలాంటి పరిస్థితుల్లో నా గురించి పట్టించుకునే వాళ్లెవరు?

రోజురోజుకీ పరిస్థితులు మరీ కష్టంగా తయారవసాగాయి. మా యింటిముందు కాపలాలు ఎక్కువయ్యాయి. నన్నెవరన్నా ఎత్తుకు పోతారని మా వూళ్ళో కుర్రకారుకి భయం పట్టుకున్నదిలావుంది. అనుమానం ఎవరో వొకరు మా యింటి ముందు బడ్డీ కొట్టుదగ్గర నాకు రక్షణ నడుపాయాలు చేస్తూ వుండేవారు. ఒకడి తరువాత ఒకడు......

అప్పుడే నాకనిపించింది, మా వూళ్లో యింకా నా యీడు పిల్లలు చాలామంది వున్నారుగా...లలిత... మీనా... వసంత... సుందరి...హేమ .. మరి వీళ్ళందరి ఇళ్ల దగ్గరా ఇలా పడిగాపులుపడి కావలి వుంటున్నారా? కాదు. మరి నాదగ్గరే ఇలా ఉండడానికి కారణమేమిటి?

అప్పటి నా ఆలోచనల్లో మొదటి సమస్య ఇది. నా అన్నవాళ్ళెవరూ లేరు కదా...వొంటరిగా వున్నాను ... అందుకే ఇలా కుర్రకారుకి లోకువైపోయాను అనుకున్నాను కొంతకాలం. కాని ఆ తర్వాత రోజుకో ప్రేమలేఖ పోస్టున వస్తుంటే... నా మీద నాకే ఒకరకమైన విశ్వాసం ఆరంభమైంది. నేనూ అందగత్తెనే కాబోలు అనుకున్నా ఒకరోజున దృఢ నిశ్చయంతో అద్దం ముందు నిలబడి! అద్దంలో నా ప్రతిరూపం నాకు ఉత్సాహాన్నిచ్చింది. అదే నాకు కొండంత ఆత్మ స్థైర్యాన్ని ప్రసాదించింది.

అమ్మ ఆరోగ్యం రోజురోజుకీ క్షీణించసాగింది. స్థలం మార్పితే ఏమయినా ప్రయోజనం వుండొచ్చునని డాక్టరు సలహా. ఎలా? స్థలం మార్చాలంటే అసహాయురాలిగా వున్న నాకు సాధ్యమయ్యేపనా?

చేతిలో డిగ్రీవుంది. నాన్నకి కృతజ్ఞతలు తెల్పుకుంటూ కనబడిన వుద్యోగానికల్లా అడిగినా అడక్కపోయినా ఫోటోతోసహా అప్లికేషన్లు పంపడం మొదలెట్టాను.

ఇంటర్వ్యూ లేకుండానే కలకత్తా నుంచి వుద్యోగంలో చేరమని వుత్తరం వచ్చింది. అదే నా జీవితంలో మలుపు తిప్పించిన సంఘటన. ఆరోజున అన్ని దేవుళ్ళకీ మొక్కుకున్నాను.

అమ్మతోసహా కలకత్తా వెళ్ళిపోయాను.

ఉద్యోగంలో చేరగానే పరిచయమైంది సరోజ. పరిచయమైన కొద్ది రోజుల్లోనే ఆత్మీయతని సంపాయించుకొంది. నేనూ ఆమె సహచర్యంలో వింత ఆనందాన్ని చూరగొన్నాను. ఇద్దరమూ ఒకటిగానే వుంటూండే వాళ్లం.

ఒకరోజు శేఖరాన్ని పరిచయం చేపించింది సరోజ. అతనేదో ఆఫీసులో మేనేజరుగా పని చేస్తున్నాడని చెప్పింది. అతనిపై నాకు ఎలాంటి అభిప్రాయమూ కల్గలేదు. అతనిని గురించి తర్వాతచెప్పింది సరోజ. చాలా పెద్ద ఉద్యోగమే. అన్ని మంచి

# వెలుగైనా చీకటి

లక్షణాలే. శేఖరం చాలా మంచివాడని తెలిసింది సరోజవల్ల.

మనిషిని ఊహించుకోలేక పోయాను. కారణం, అతను పరిచయమైనప్పుడు అంత అంత పరిశీలనగా చూడలేదు నేను. మంచి పర్సనాలిటీ వున్నట్టుగా అనిపించిందిగాని అతని రూపురేఖల్ని పూర్తిగా జ్ఞాపకం చేసుకోలేకపోయాను.

ఎందుకో అతనంటే ఒకరకమైన ఉత్సాహం వచ్చేది. అతన్ని మళ్లీ ఒకసారి చూస్తే బాగుండును అనిపించేది.

ఆ మర్నాడు సరోజతో మళ్లీ వచ్చాడతను. చూశాను. మనిషి చామనఛాయ అయినా ఎంతో రాజసం. ఠీవి ఉట్టిపడే రూపం అతనిది. నా కంటికి చాలా బాగున్నాడు.

అదే అన్నాను సరోజతో.

సరోజ ముఖం ముడుచుకుపోయింది. తర్వాత గట్టిగా నవ్వేసింది. ఆమె తత్వమే అంత.

శేఖరం తరచూ వస్తూ వుండేవాడు. సరోజ కంటె నాతో ఎక్కువసేపు కాలక్షేపం చేస్తూ వుండేవాడు. అతనితో కబుర్లాడుతూ కూర్చుంటే గంటలు నిమిషాల్లా కదలిపోతుండేవి.

ఒకరోజు సరోజ అననే అనేసింది కూడా— 'కొంపదీసి ఇద్దరూ ఏమన్నా ప్రేమాయణం సాగించడం లేదు కదా...?' అని.

తర్వాత కొన్నాళ్ళకి ఆమె మాట అక్షరాలా నిజమయింది.

నేను శేఖరాన్ని ప్రేమిస్తున్నాను అని తెలుసుకునేప్పటికి—అతను నన్ను మరింత గాఢంగా ప్రేమిస్తున్నట్టు నాకు తెలిసిపోయింది.

అతనే అన్నాడు, ఒకరోజు ధైర్యం చేసి—

'నిన్ను ప్రేమిస్తున్నాను రాధా...నువ్వు అంగీకరిస్తే ఇద్దరం పెళ్లిచేసుకుందాం. పెళ్లయితే నీతోటే... బ్రతుకుంటే నీతోటే...నువ్వు లేకపోతే నేను లేను...' అన్నాడు. అతను తొందరపడి అలా అనివుండకపోతే నేనే అడిగేసివుండేదాన్ని. ఏమయితేనేం? మొత్తంమీద నాపని సులువయిపోయింది. నా కోరిక నెరవేరిపోయింది.

అతను మొదటిసారిగా తన ప్రేమని వ్యక్తంచేసిన రోజున వెయ్యి దీపావళులు విరబూశాయి. జీవితంలో మొట్టమొదటిసారిగా అంత ఆనందాన్ని చూడగల్గాను. అమ్మ పసిగట్టి అనేసింది కూడా — 'నీ ముఖంలో ఎప్పుడూలేనికళ వచ్చింది. నా కోరిక తీర్చేరోజు దగ్గర్లోనే వుందా ఏమిటి?' అని.

ఎక్కడలేని సిగ్గూ ఆవరించుకుంది నన్నప్పుడు. అమ్మతో చెప్పాను శేఖరం విషయం. అమ్మ ఎంతగానో సంతోషించింది.

సరోజతో చెప్పేశాను తనందరం పట్ట లేక. ఆమె నన్ను చాలా చాలా అభినందించింది.

తర్వాత చాలారోజులవరకు సరోజ నాకు కనిపించలేదు.

శేఖరం మా యింటికి వచ్చాడు. పెళ్లి ప్రస్తావన వచ్చినప్పుడు అతని ముఖం అదో మాదిరిగా మారిపోయింది. అతనిలో ఎప్పుడూ లేని మార్పు ఏదో నాకు కనిపించింది.

పెళ్లి మాటలు జరిగాయి, ఎప్పటికయినా నా భర్త అతను అనే ధైర్యంతో అంత క్రితం రోజు నన్ను నేనతని కర్పించుకున్నాను. అనందపు టంచుల్ని అందుకుని, స్వర్గలోకాల్లో విహరించాము.

మరి? శేఖర మేమిటి ఇలా అదోమాదిరిగా వున్నాడు? కొంపదీసి, నన్ను మోసం చెయ్యడం లేదుకదా ఈ మనిషి?— నాకు కొంత భయం కల్గినమాట వాస్తవం...

అమ్మ లోపలికి వెళ్లినపుడు నా భయాన్ని అతని ముందుంచాను. అతని హృదయంమీద వాలిపోయి ఏడ్చేశాను.

నన్నతను వూరడించాడు. ఆ వూరడింపుతో ఎంతో ధైర్యం వచ్చింది. తర్వాత నన్ను నేనే చీదరించుకున్నాను, అనవసరమైన అనుమానాలతో ఎందుకు మనసు పాడుచేసుకుంటున్నానా అని నన్ను నేను తిట్టుకున్నాను.

నా భయం వట్టిభయం కాదనీ, నా అనుమానం వట్టి అనుమానం కాదని తెలియడానికి వారంరోజులు పట్టింది. ఈ వారంరోజులుగాను శేఖరం నాకు కనిపించలేదు.

అతని ఆఫీసుకి ఫోను చేశాను. సరోజకి ఫోన్‌చేశాను. ఇద్దరూ నాకు దొరకలేదు. నాకువచ్చిన ఉత్తరం నా అనుమానాన్ని దృఢంచేసింది.

ట్రాన్స్‌ఫరై వెళ్లిపోయినట్టు రాశాడు శేఖరం. ఎక్కడికో రాయలేదు. ఎప్పుడొస్తాడో రాయలేదు. నాకెందుకు చెప్పి వెళ్లలేదో రాయలేదు. ఇంకేమీ రాయలేదు.

నేను లేకపోతే. తను లేనన్నాడు. అంత ప్రాణంగా ప్రేమించిన నాతో






**బ్రూక్ బాండ్ A-1 డస్ట్**
**ప్యాకెట్టుకు**
**హెచ్చు కప్పుల మంచి టీ**

చెప్పి వెళ్ళడానికయినా తీరికలేదా ఈ మనిషికి? కాదు, తీరిక లేకపోవడం కాదు. మోసం...శుద్ధ మోసం!

నేను మోసపోయాను. పూర్తిగా మోసపోయాను. అయినా ఇంకా ఏదో ఆశ. శేఖరం మోసం చేస్తాడంటే నమ్మకం కుదరని ఏదో పిచ్చిఆశ...నన్నింకా బ్రతికించింది.

మూడు నెలలు గడిచేసరికి తెలిసింది, పూర్తిగా మోసపోయానన్న విషయం. శేఖరం దగ్గరనుంచి ఉత్తరం లేదు. అతని అడ్రసు లేదు...సరోజ లేదు.

నేను గర్భవతిని...!

ఈ భయంకరమైన సత్యాన్ని నేనెలా దాచను? శేఖరం దగాచేసిన విషయం మాసిపోయింది. అయినా చావాలని లేదు. ఇంకా బ్రతకాలనే వుంది. శేఖరం మీద కసి తీర్చుకోడానికి కాదు, అమ్మ కోసం! అమ్మ బ్రతుకుకోసం!

అమ్మకి నా ముఖమెలా చూపించను? అమ్మతో మాట్లాడ్డానికే సిగ్గుగా వుంది. తల కొట్టేసినట్టుగా వుంది. పరువుగల కుటుంబం ... మర్యాద ... గౌరవంగల కుటుంబం...నేను మచ్చతెచ్చిన దాన్ని. నన్ను పిరికితనం పెనవేసుకు పోయింది. భయంతో ఊపిరి సలపక కొట్టుమిట్టాడి పోతున్నాను.

దిక్కుతోచని స్థితిలో డాక్టర్లని సంప్రదించాను. ఏ డాక్టరూ నాకు సాయపడలేదు. జనాభా పెరిగిపోతుందని

# వెలుగూ చీకటీ

గోల పెట్టడమే గాని, పెరుగుదల అరికట్టడానికి మహిళలు ముందుకు వస్తున్నా చేయూత నివ్వరీ డాక్టర్లు! ఒకవేళ వాళ్ళు ముందుకు వస్తామన్నా ప్రభుత్వం ఆంక్షలు! ఎలా తీరుతుంది జనాభా సమస్య?

చివరికి తప్పలేదు. నాకు నేనుగానే రహస్యంగా ఒక మంత్రసాని నడిగి ఒక నాటుమందు తిన్నాను. అది నా ప్రాణం మీదికి తెచ్చింది.

హాస్పిటల్లో చేరక తప్పింది కాదు. నేను హాస్పిటల్లో చేరగానే రెక్కలు కట్టుకు వాలింది సరోజ. ఆమెను చూడగానే నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆమెమీద నా అపోహ పూర్తిగా తొలిగిపోయింది.

నేను అడక్కుండానే తను చెప్పింది. శేఖరం పచ్చి మోసగాడట. తను ఎంక్వయిరీ చేయగా తెలిసిందట!

ఇన్నాళ్ళూ తను ఊరికి వెళ్ళిందట. పాపం, వాళ్ళ నాన్నగారికి బాగా సుస్తీ చేస్తే మెడికల్ లీవుమీద వెళ్ళి ఉద్యోగానికి రాజీనామా పంపించిందట. నా వార్త ఆమెకి ఎలా తెలిసిందో మరి... వెంటనే వచ్చి ఆదుకుంది. హాస్పిటలు వాళ్ళతో చెప్పి, నాకు అన్ని రకాల సదుపాయాలూ చేసింది. న్యాయస్థానం దృష్టి నామీద పడకుండా 'నన్ను నేను'గా మిగిల్చింది. ఆమె లేకపోతే నేను ఏమైపోయి వుండేదాన్నో! ఎప్పటి లాగా కన్య లాగా హాస్పిటల్నుండి విడుదలయ్యాను.

ఆ పరిసరాలు నన్ను చాలా బాధపెట్టసాగాయి. ఎప్పుడూ శేఖరం స్మృతులు నన్ను తినేస్తుండేవి. సరోజకి చెప్పుకున్నాను. ఆమె ఎవరినో పట్టుకుని నాకు ట్రాన్స్ఫర్ ఏర్పాటు చేయించింది.

అప్పటి నుంచీ ఇక్కడే పని చేస్తున్నాను. నన్ను ప్రాణంగా చూసుకుని ఎంతో సేవ చేసింది సరోజ. ఆమె ఋణం నేను తీర్చుకోలేను.

ఆమె దగ్గరనుంచి ఉత్తరాలువస్తూనే వున్నాయి. ప్రతి ఉత్తరంలోనూ శేఖరం గురించి రాస్తూనే వుంది. అతని చెడు తిరుగుళ్ళ గురించి ఏకరువు పెడుతూనే వుంది. సరోజ రాసిన రాతలు చూస్తే ఎలాంటివారి మనసైనా విరిగి పోతుంది. అంత అసహ్యమైన అభిప్రాయం ఏర్పడుతుంది అతని మీద. ఏమిటో మరి? అంత జరిగినా శేఖరం మీద నాకింకా ఆశగానే వుంది! సరోజ శేఖరం ప్రవర్తన గురించి ఎంత హీనంగా రాస్తున్నా, అతనిమీద నా సదభిప్రాయం తొలగిపోవడం లేదు. నేను ప్రేమించిన మనిషతను. నేనతనికి అర్పించబడ్డాను. ఎప్పుడూ నేనతని మనిషినే! నా ప్రేమ అలాంటిది. నా స్వభావం అలాంటిది.

అందుకే నన్ను తిడుతుంది సరోజ. కోప్పడుతుంది. మంచి చెడ్డా తెలుసుకోమని హితబోధ చేస్తుంది. నేను నవ్వడం కంటే ఏమీ చెయ్యలేకపోతాను. అది నా బలహీనతే!

* * *

సరోజ నాతో మూడు రోజులుంది. ఆ మూడు రోజుల్లోనూ ఏ మూడు గంటలో నాతో గడిపింది. తక్కిన సమయమంతా ఎక్కడెక్కడో వుండి వస్తోంది. ఈ మహానగరమంతా ఆమె చుట్టాలే! సరోజ అదృష్టవంతురాలు.

వెళ్ళేముందు అంది సరోజ...

'ఈ మూడు రోజుల్లోనూ నువ్వెంతగా చిక్కిపోయావో తెలుసా? అదుగో ఆ అద్దం ముందు నిలబడు...నీకే తెలుస్తుంది' అని.



నేను విరక్తిగా నవ్వాను.

శేఖరం పెళ్ళివార్త నన్నిలా చేసిం దని ఆమెతో ఎలా చెప్పను?

ఏ ముఖం పెట్టుకు చెప్పను?

శేఖరం పెళ్ళివార్త నాకు నిద్ర లేకుండా చేసింది. ఆకలి లేకుండాచేసింది. ఇవన్నీ మనసులో విషయాలు. ఆమెకి తెలిసేలా ఎలా చెప్పను? నా బాధ ఆమె అర్థం చేసుకోగలుగుతుందా? అన్నీ తేలిగ్గా తీసుకునే సరోజ; కష్టాల్ని నీటి బిందువుల్లా ఎంచుకుని తామరాకులా తిరిగే సరోజ, నన్నూ నా బాధని అర్థం చేసుకోగలుగుతుందా? ఎప్పటికి లేదు. నాకు ద్రోహం తలపెట్టిన వాడిపై యింకా వ్యామోహం వుంచుకున్నందుకు తిడుతుంది. కోప్పడుతుంది.

'ఏం మాట్లాడవేం...? అసలు నువ్వు భోజనం చేస్తున్నావా?'

అంది మళ్ళీ సరోజే, నే నేమీ మాట్లాడకపోయేసరికి...

నాకు మళ్ళీ ఏడుపొచ్చింది. ఆమెని కావలించుకుని ఏడ్చేశాను. అంతకంటే సమాధానం చెప్పడం నావల్ల కాక పోయింది.

సరోజ కళ్ళల్లో కూడా నీళ్ళు తిరిగాయి. నాకు ఎంతో అద్భుతమనిపించింది. సరోజ కళ్ళల్లో మొదటిసారి నీళ్ళు చూడగల్గాను. నా మనసు కరిగిపోయింది. ఆమెను చాలా బాధపెట్టి వుంటాననిపించింది.

'రాధా...నువు పెళ్ళిచేసుకోవా?'

అంది కళ్ళు తుడుచుకుంటూ సరోజ.

'అమ్మ నా పెళ్ళిచూసి చచ్చిపోతా నంటుంది. అందుకే చేసుకోను...'

అన్నాను. ఎందుకో నవ్వొచ్చింది.

సరోజకి నా మనసు తెలియకనా? అలా అడిగింది? తెలుసు. అయినా ఏదో అడగాలి గనక అడిగింది.

'మీ అమ్మ చచ్చిపోతానంటుందని నువ్వు పెళ్ళిచేసుకోవు. ఆ తర్వాత నీ బ్రతుకుమీద నమ్మకం నీకు లేదు. నువ్వు మీ అమ్మ బ్రతుక్కోసమే బ్రతుకుతున్నావు కదూ...'

అంది బేలగా సరోజ.

ఆమె మాటల్లో నాకేవో కొత్త ధ్వనులు వినిపించాయి. సరోజలో యింత






# వెలుగా చీకటో

మార్ధత్వముందని నే నెప్పుడూ అనుకో లేదు.

ఆ మాటను తప్పించా లనిపించింది. నవ్వు కొనితెచ్చుకున్నాను. కృత్రిమంగా నవ్వాను. నవ్వి, అన్నాను...

'మరి నీ పెళ్ళెప్పుడు?'

అని...

'నీ పెళ్ళయ్యాకే నా పెళ్ళి' అంది మెట్లు దిగుతూ సరోజ.

నా దగ్గర సెలవుతీసుకుంటూ ఒక కవరు చేతిలో పెట్టి తను వెళ్ళిపోయాక చదువుకోమంది.

స్టేషన్లో ట్రయిను బయలుదేరి వుంటుంది ఈ పాటికి!

కవరు విప్పాను.

అదో శుభలేఖ!

శుభలేఖ కొట్టివేసివుంది. రెండో వైపు తిప్పాను. దానిమీద ఏమిటో రాసి వుంది. రాయడానికి కాయితం దొరక్క, పాత శుభలేఖ దేనిమీదనో రాసి వుంటుం దనుకున్నాను. చదివాను.

'రాధా,

నేను నీకు చాలా అన్యాయం చేశాను. ఓర్వలేక నీకూ శేఖరానికి ఎడబాటు కల్పించాను. అతనిమీద రాయరాని రాత లన్నీ నీకు కల్పించి రాశాను, అతను నిన్ను విడిచి వెళ్ళిపోడానికి కారణం నేనే. నేనే అతన్ని నీకు దూరం చేశాను. నన్ను కాలదన్ని నిన్ను చేసుకోవడం సహించలేకపోయాను. అతన్ని మా నాన్న గారు మనిషిగా చేశారు. మా నాన్న మాట అతనికి వజ్రాయుధం! అందుకనే ఎటూ చెప్పలేక నీకు దూరమైపోయాడు శేఖరం. నాతో పెళ్ళికి ఒప్పుకోక తప్ప లేదు. చెప్పానుగా మా నాన్నంటే అతనికి అంతులేని భక్తి విశ్వాసాలని... మా పెళ్ళి శుభలేఖ ఇస్తూ నీతో చెప్పాలని వచ్చాను. కాని, అనుకున్నదొకటి, జరిగింది మరొకటి. నువ్వే నెగ్గావు. నయానో భయానో శేఖరం నన్ను పెళ్ళి చేసుకోవచ్చు. కాని అతడు నాకు భర్తగా న్యాయం చెయ్యలేడు. అతని మనసు నిండా నువ్వే. ఆ విషయం బాగా తెలుసు. ఎప్పుడూ నిన్నే తలుస్తూ వుంటాడు. నువ్వు లేకపోతే అతను పిచ్చివాడై పోతాడేమో కూడా! ఇదే శుభముహూర్తానికి నీకూ శేఖరానికి పెళ్ళి జరిపించే భారం ఇప్పుడు నేను వహిస్తున్నాను. నా మనసు తిరిగిపోడానికి కారణం నువ్వే. శేఖరం అన్యాయం చేశాడని తెలుసుకుని కూడా నువ్వు అతన్ని ప్రేమిస్తున్నావూ అంటే నువ్వు నిజంగా దేవతవి. నీకు నే చేసిన అపరాధం మన్నించరానిది. మీ యిద్దరికీ పెళ్ళిచేసే భాగ్యం నాకు ప్రసాదించు. నా గురించి బాధపడకు. నేనూ పెళ్ళిచేసుకుంటాను, నీ పెళ్ళి అయ్యాక...

వుంటాను,
సరోజ.

నమ్మలేకపోయాను. శుభలేఖ చదివాను. నిజమే! శేఖరం సరోజలకి పెళ్ళట!

ఈర్ష్యాద్వేషాలు ఎంతెంతటి పనులు చేయిస్తాయో అప్పుడు నాకు తెలిసింది.

శేఖరం నాకు దేవుడులా కనిపించాడు. సరోజకూడా దేవత లానే కనిపించింది. సృష్టి యావత్తూ సర్వాంగసుందరంగా కనిపించింది.

నేను అదృష్టవంతురాల్ని.

అమ్మ కోరిక తీరుస్తాను నన్న మాట!

మనసులో ఏదో మూలకలుక్కు మంది.

'అమ్మా...అమ్మా' అంటూ లోపలికి పరుగెత్తాను.

అమ్మ నిశ్చలంగా నిద్ర పోతోంది.

గదిలో చీకటి...దీపం వున్నా తొలగిపోని చీకటి...!

బయట వెలుతురు...ఎంత కాదు చీకటి నన్నా తరమగల వెలుతురు!! ●

# వారఫలం

## 23-1-1970 శుక్రవారంమొదలు

## 29-1-1970 గురువారం వరకు

**మేషం:** సామాన్యమైన పనులకు కూడా యెంతోకృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. పోటీవారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరుతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృషభం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషిరాణిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**సింహం:** కొన్ని వ్యవహారాల్లో శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో అనుకూలత లభిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కన్య:** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూలత పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**తుల:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో మీతాలూకు వస్తువులు పోవచ్చును. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** అన్ని వ్యవహారాల్లోనూ మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధువులకు సహాయం చేస్తారు.

**మకరం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ప్రయోజనసంగల పరిచయాలు యేర్పడతాయి. వారం మధ్యలో వృత్తిలో చికాకులు యేర్పడతాయి. అధిక వ్యయం జరుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు— పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** వ్యాపారంలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు— ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మీనం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్యకళారంగంలో ఖ్యాతి లభిస్తుంది. పోటీవారితో మాట పట్టింపులు తగవు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

—మహేష్



ఆశ్చర్యపోయాడు త్యాగరాజు. అదే పైకి అనేశాడు గూడా: 'రాణి ఇంట్లో లేదల్లే వున్నది!'

చలపతి అవకాశం చిక్కినట్లుగా, 'అదే నేను చెప్పబోతున్నాను!' అన్నాడు త్వర త్వరగా.

'అంటే ?' తిరిగి త్యాగరాజు మదురు ముడిపడింది.

'మీరు రాణిని ఏదైనా పూరు పంపారా ?'

'లేదే?' అన్నాడు నొరులరయుసూ.

'అయితే నే ననుమానిస్తున్నదే నిజమన్న మాట!'

'ఏమైంది ?' ఆత్రంగా ముందుకు వంగి అడిగాడు త్యాగరాజు.

'రాణి వెళ్ళిపోయింది!'

'అంటే—?!'

'రాణి సుందరమూర్తితో వెళ్ళిపోయింది!' చలపతి త్యాగరాజు మొఖంలోకి చూస్తూ నంగి నంగిగా అన్నాడు ఊపిరి బిగపట్టుకున్నట్లు.

త్యాగరాజుకు ఒక్కక్షణం ఏమీ అర్థం కాలేదు. అయోమయంగా చలపతి మొఖం లోకి చూచాడు.

చలపతి మొఖం పక్కకు తిప్పుకున్నాడు.

అలా తిప్పుకోవటంలో ఏదో ఎక్కడో మెరిసినట్లయింది!

త్యాగరాజుకు అర్థమయింది!

అతడి ముఖం మరుక్షణంలోనే తెల్లగా పాలిపోయింది!

*　　　*　　　*

త్యాగరాజుకు తరువాత అరగంటవరకు

పోటిమాట పెగల్లేదు.

జుట్టును చేతుల్లో ఇరికించుకొని నేలనుచూస్తూ చలపతికి ఎదురుగా కూర్చున్నాడు.

అరువాత పావుగంటకు చలపతి లేచి నిల్చున్నాడు.

త్యాగరాజు తలెత్తాడు.

చలపతి అతడి బుజంమీద చిన్నగా తట్టి వెళ్ళిపోయాడు!

త్యాగరాజు అతడు వెళుతున్న వైపే చూస్తూ కూర్చుండిపోయాడు.

తరువాత లేచి నిలబడ్డాడు.

వాకిటివైపుకు వచ్చి చలపతి దగ్గరగా వేసి వెళ్ళిన తలుపులకు లోపల ఘడియవేశాడు.

గది తలుపు తీసుకొని వెళ్ళి చీకట్లో తడుముకుంటూ లైటు వేశాడు.

బిక్కు బిక్కుమంటూ, భయంభయంగా టేబుల్‌వైపుకు చూచాడు.

అతడి కళ్ళకు—అతడు ఊహించినట్లుగానే—రాణి వ్రాసిపెట్టిన కాగితం కనబడింది.

అది తీసి చదువుకోసాగాడు.

'అన్నయ్యా,

ఒక్కోసారి నా కనిపిస్తుంటోంది—మనని ప్రేమించేవాళ్ళకు మనం న్యాయం చేకూర్చలేమోనని...ఏవో...ఏది ఏమైనా నీకు అన్యాయం చేయటానికే నా మనస్సు స్థిరనిశ్చయానికి వచ్చింది...అవును అన్నయ్యా! నేను నీకు అన్యాయం చేస్తున్నాను...ఇక, నీవు నలుగురిలో తలెత్తుకు తిరగటానికే భయపడి ఏ అఘాయిత్యం చేస్తావోనని భయంగా వున్నదన్నయ్యా!...కానీ ఈ 'పాపికి' అవన్నీ ఏవి లెక్క?...

నేను వెళ్ళిపోతున్నానన్నయ్యా!

సుందరమూర్తి కట్టినలోకంలో విహరిద్దామని...స్వర్గంలో తప్ప కనబడనటువంటి నీలాటివాడికి దూరమయి! నా మనస్సు చేతిలో చిక్కుకుపోయి పరాధీన అయిన నేను పూర్తిగా వోడిపోయాను...

క్షమించగలవా అన్నయ్యా?

ఊహూఁ...వద్దు... నాగురించిన ఏ ఆలోచనా పెట్టుకోవద్దు... నా కోసరం ఒక్క కన్నీటిబొట్టునైనా వెచ్చించవద్దు...నన్ను క్షమించవద్దు అన్నయ్యా!

# మేఘమాల

క్రితం క్షణంవరకు
నీ ప్రియాతి ప్రియమైన
చెల్లి
'రాణి'.

త్యాగరాజుకు అంతా అయోమయమయింది.

ఎందుకిలా జరిగింది?

—ఎంత ఆలోచించినా ఆ ప్రశ్నకు సమాధానాన్ని కూడదీసుకోలేకపోతున్నాడు!

ఒక్కసారిగా—తన సర్వస్వం—తనకు దూరమయిపోగా—తను ఏకాకి అయిపోయినట్లుగా, తను అన్నీ పోగొట్టుకున్నట్లుగా ఫీలయ్యాడు.

అలాగే పడక కుర్చీలో పడుకున్నాడు.

కళ్ళుమూసుకు పడుకున్నాడు.

తరువాత—ఎప్పుడో నాలిక ఎండినట్లనిపిస్తే—లేచి, టేబుల్‌మీద ఒంటిగంట చూపిస్తున్న గడియారాన్ని—ఆఫీసు గుడ్డలైనా మార్చుకోని తనని చూచుకొని—ఒక గ్లాసు మంచినీళ్ళు త్రాగి మళ్ళా కళ్ళు మూసుకు మంచం మీద పడుకున్నాడు.

* * *

ఇల్లంతా బిక్కు బిక్కుమంటోంది.

గలగలా నవ్వుతూ, తనని నవ్వించే రాణి లేదు—ఇక తనకు సంతోషంలేదు... ఇక తనకు ఏవీ లేదు!

శూన్యంలోకి చూస్తూ అలాగే పడుకున్నాడు.

లేవ బుద్ధికాలేదు.

ఏమీ చేయాలనిపించటంలేదు.

గడియారం తొమ్మిదయిందని చెబుతుంది.

ఒక్కసారి దానివంక తల తిప్పి చూచి తల తిప్పుకున్నాడు.

గుండె గుబులు గుబులు మంటోంది.

ఎవరో గుండెను పిండేస్తున్నట్లనిపిస్తోంది.

రాణి లేకుండా తనెలా బ్రతకగలడు?

పది సంవత్సరాలబట్టి తండ్రి లేడు. ఐదు సంవత్సరాలబట్టి తల్లిలేదు.

—ఈ నాడు? ఉహూ......

తనకు ఎవరూ లేరు!

—నీరసంతో కృంగిపోయాడు. కళ్ళు మూతలుపడ్డాయి. మొఖమంతా పీక్కుపోయింది...

తనెకి బ్రతుకెందుకు?

మరో గంట పట్టింది అతడు పక్కమీదనుండి లేచేటప్పటికి. లేచి ముఖం కడుక్కున్నాడు. నిన్నటి ఆఫీసు గుడ్డలు విప్పి వంకెన వున్న మరో జత వేసుకున్నాడు. రాణి ఇచ్చే అమృతంలాంటి కాఫీని, గుండెలు కలుక్కుమనగా ఒక్కసారి గుర్తుకు తెచ్చుకొని, బయటకు నడిచాడు—ఇంటికి తాళంవేసి!

గబ గబా హోటల్‌కు నడిచి—కషాయంలాంటి కాఫీని ఓ గుక్కెడు త్రాగి—కౌంటర్ దగ్గరకు వచ్చి ఫోనెత్తి—నెంబర్ డయిల్ చేసి, 'హలో' అన్నాడు—గొంతు నీరసంగా, జ్వరపడి ఆరోజే పత్యంతిన్న వాడి గొంతులా వున్నది.

'హలోవ్ ... కెన్ — ఐ స్పీక్టు రాజేశ్వరి?'

ఓ నిముషం ముళ్ళమీద నిల్చున్నాడు.

'యస్...రాజేశ్వరి స్పీకింగ్!'

'నేను త్యాగరాజును మాట్లాడుతోంది!'

'చెప్పండి!'

'ఒక్కసారి యింటికి వస్తావా?... ఇవ్వాళ్టికి సెలవు పెట్టేయ్ రాజేశ్వరీ!' మరో మాటకు అవకాశం లేకుండా ఫోన్ పెట్టేశాడు.

* * *

ఎదురెదురుగ్గా ఒకళ్ళ మొఖంలోకి మరొకరు చూస్తూ కూర్చుండిపోయారు త్యాగరాజు, రాజేశ్వరి!

త్యాగరాజు కంటివెంట నీరు అతడి చొక్కాను ఛాతిమీదగా తడిపివేస్తూ కారుతోంది.

'బాధపడబోకండి!' రాజేశ్వరి ఓదార్పు కంఠంతో అన్నది.

'దేన్ని చూసి మర్చిపొమ్మంటావ్... నేనీ బాధను మర్చిపోలేను రాజేశ్వరీ!... నావల్లకాదు... నాకాశక్తి లేదు!' అతడు తల అటూ యిటూ త్రిప్పాడు.

తిరిగి నిశ్శబ్దం వాళ్ళిద్దరిమధ్యా నృత్యం చేసింది.

అతడు తల ఊగిస్తూనే, 'నేను బ్రతకలేను రాజేశ్వరీ!...నాకీ జీవితం వద్దు!' అన్నాడు.

రాజేశ్వరి నిట్టూర్పు విడిచింది.

'మీకు బాధ వుండదని నేనను...కానీ

# మేఘమాల

దానికో హద్దు వుంటుంది...ఓ పరిధి వుంటుంది!'

'రాజేశ్వరీ!'

'నిజం!...నేను చెప్పింది సావకాశంగా వినండి...రాణి మిమ్మల్ని మోసం చేసిందనీ, మీ మనస్సుతోనూ, జీవితంతోను ఆటలాడిందనీ మీరు భావించవచ్చు...అలా చేయటంలోనూ ఆమె ఎంత బాధ పడిందో మీరు ఊహించండి!... ఊహూఁ... ఒక్క క్షణం మనస్సు నిర్మలపరుచుకొని ఆలోచించండి!'

అతడు పిడికిలి బిగించుకున్నాడు. నరాలు బిగపట్టుకున్నాడు. అతడి శరీరం చెమటలు కక్కింది. అతడు సర్వం మరిచిపోయాడు.

'తనకు ఏమీ లేదు...ఊహూఁ...తనకు ఏ ఆలోచనా వద్దు!'

అతడు తల విదిలించాడు!

* * *

రాజేశ్వరి తల ఎత్తి త్యాగరాజు ముఖంలోకి సూటిగా చూస్తూ, 'మీ నిర్ణయం మార్చుకోలేరా?' అడిగింది.

ఆమె కళ్లను నీటి పొరలు క్రమ్మినయ్.

'అలా మార్చుకోవటంలో నాకు మనశ్శాంతి లభిస్తుందని నే ననుకోవటం లేదు!'

— రాణి అతడిని ఒంటరివాడినిగా చేసి వెళ్లిన మూడవనాటి రాత్రి త్యాగరాజు రాజేశ్వరుల నడుమ త్యాగరాజు గృహంలో నడుస్తున్న సంభాషణ అది!

ఆమె ఒక్క క్షణం తటపటాయించింది. 'నేను ఒక్క ప్రశ్న అడుగుతాను సమాధానం చెబుతారా?' అన్నది. చాలా బరువుగా వచ్చినయి ఆ మాటలు.

'అడుగు!'

అతడి మాటలు పూర్తి అయ్యీ అవ్వకముందే, 'వద్దు! వద్దు!...నా దేవాలయాన్ని నన్ను అలాగే నిర్మించుకోనీయండి!' అన్నది. అలా అంటుంటే ఆమె కంఠం తడబడింది.

'రాజేశ్వరీ!...వద్దు...సంశయం వద్దు...తిరిగి మనం ఎన్నడు కలుసుకుంటామో?...ఊహూఁ... అసలు కలుసుకుంటామో లేదో? అడుగు రాజేశ్వరీ... నీ సందేహం తీర్చుకో!'

ఆమె ఒక్క క్షణం సంశయించి బరువౌతున్న కళ్ళను రెప్పలతో మూసింది..

ఆమె హృదయం శోకంతో నిండిపోయింది. కృంగిపోయింది.

అతడి ముఖంలోకి బిక్కు బిక్కుమంటూ చూస్తూ, 'ఓ వ్యక్తి మీ హృదయం మీద తెలిసో తెలియకో దెబ్బ కొట్టి వెళ్లింది...అలాగే మీరూ మరొకరి మీద...' నత్తి నత్తిగా గొణగసాగింది.

అతడు త్వర త్వరగా కల్పించుకుంటూ, 'తెలిసి నేనెన్నడూ అలాంటి పని చేయను రాజేశ్వరీ...నేను హృదయ పూర్వకంగా చెబుతున్న మాటలు యివి!' అతడు వంగి పక్కన కూర్చున్న రాజేశ్వరి ముఖంలోకి చూస్తూ దృఢంగా అన్నాడు.

అప్రయత్నంగా రాజేశ్వరి చేతులు అతడి పాదాలమీద వాలినయి. 'నా కదే చాలు...నా కదే తృప్తి...అంతకంటే నేను కోరుకుండేదేమీ లేదు గూడా!' ఆమె ఆవేశంగా అన్నది.

—మరు క్షణంలోనే ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది...

త్యాగరాజు నిశ్చేష్టుడయ్యాడు!

* * *

హైదరాబాద్ వెళ్లే రైలు అంత రద్దీగా లేదు. బండి ప్లాట్‌ఫారంమీద ఆగగానే త్యాగరాజు త్వరత్వరగా ఎక్కి, సామాన్లు పెట్టుకునే పెట్టెమీద బెడ్డింగ్ పరిచేశాడు.

దానిమీద ఎక్కి పడుకొని కళ్ళు మూసుకున్నాడు.

అప్రయత్నంగా కళ్లవెంట నీరు జలజలా రాలింది.

'ఏమిటీ ప్రయాణం? ఎక్కడికీ ప్రయాణం?'—ధ్యేయంలేని తన ముందు జీవితం గురించిన ఆలోచనలు అతడిని ఉక్కిరి బిక్కిరి చేయసాగినయ్.

తరువాత రైలు — తన ఊరిని — ఇరవై సంవత్సరాలనుండి తనని కడుపులో దాచుకున్న తన ఊరిని వదిలి — చీకటిని చీల్చుకుంటూ తనకు తెలియని ప్రదేశంలోకి వెళ్లిపోతున్నప్పుడు — కళ్ల ముందు కన్నీళ్లతో తనను సాగనంపిన రాజేశ్వరి నిలబడింది.

మనిషి వికలితుడయ్యాడు.

'మిస్టర్! ఇప్పుడు వెళ్లిపోయిన ఊరు ఏదో చెప్పగలరా?'

త్యాగరాజు— ఆలోచనల నడుమ ఉక్కిరి బిక్కిరి ఔతున్న త్యాగరాజు — ఉలిక్కిపడ్డాడు.

ఆ తరువాత తేరుకొని సమాధానం



చెప్పాడు— ఎదురుగ్గా బెర్తు మీద పడుకొని తనవంకే చూస్తూ అడిగిన తోటి ప్రయాణీకునికి!

అతడే మళ్ళీ అడిగాడు.

'మీరు హైద్రాబాదేనా వస్తూంటు?'

'అవునండి!'

'అక్కడ పని చేస్తున్నారా మీరు?'

'లేదండీ!'

'ఏదైనా అలాంటి ప్రయత్నమా?'

త్యాగరాజు కాస్త ఇబ్బందిగా అటూ యిటూ కదిలాడు.

'అలాంటిదే—!' ముభావంగా అన్నాడు.

'హైద్రాబాదు వున్నది చూశారూ—' అవతలాయన లేచి బాసి పెట్టు వేసుకు కూర్చొని, దిండు క్రిందగా పెట్టిన సిగరెట్టు పెట్టెను అగ్గిపెట్టెను బయటకు లాగి, సిగరెట్టు ముట్టించి గట్టిగా దమ్ములాగాడు. 'ఇంతకీ మీరు హైద్రాబాద్‌కు పాతకాపులేనా?'

'లేదు!...ఇదే మొదటిసారి అక్కడకు ప్రయాణం!'

'ఇంకేం!...అయితే నేను చెప్పేది సావధానంగా వినాలి మీరు...లేదంటారా... ఆ ఊళ్లో మీరు దిగీ దిగగానే ముందు మోసపడేది రిక్షావాడి చేతిలో!'

త్యాగరాజుకి అతడి ధోరణి కొద్దిగా నవ్వు తెప్పించింది.

త్యాగరాజు అతడి మాటలకు అనకట్ట వేస్తున్నట్లుగా, 'మీరేం చేస్తుంటారు అక్కడ?' అని అడిగాడు.

'ఓ చిన్న ప్రైవేటు ఫరమ్‌లో రెండు వందల రూపాయల గుమాస్తా గిరి ... అసలు చూశారూ — నాకీ పాలసీ ఏమీ నచ్చలేదండీ! మనంచేసే ఉద్యోగాన్ని బట్టికాదు ... మన పరిస్థితులు, మన కుటుంబంలోని సభ్యుల సంఖ్యగూడా తీసుకొని జీతం ఇవ్వటం మొదలు పెడితే —ఎంతో బాగుంటుం దనిపిస్తోంది నాకు!'

త్యాగరాజు నవ్వాడు: 'అంత తేలిగ్గా చెప్పలేం!...దేనికైనా దాని ఇబ్బందులు దాని కున్నాయి!... అని కాస్త చొరవ తీసుకుంటున్నట్లుగా, మీ పేరు చెప్పనే లేదు ... నా పేరుమాత్రం త్యాగరాజు!' అన్నారు.

త్యాగరాజు లేచి కూర్చున్నాడు — అతగాడితో కాస్త కాలక్షేపం చేద్దామనే





# రచయితలకు
# మనవి

**కథలు, వ్యాసాలు**

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాతప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్ళలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

**నవలలు**

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పరిమిత ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

**కార్టూన్‌లు**

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరిచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము. కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ సంగతిని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# మేఘమాల

ఉద్వేగంతో!

'నా పేరు చెప్పాలి అంటే—దాని వెనుక కథంతా చెప్పాలి — అయినా అడిగారు గనుక మిమ్మల్ని నిరాశ బుచ్చటం నా కిష్టంలేదు...చెబుతాను వినండి! — నేను పుట్టకముందు మాయింటి పరిస్థితులు ఎంతో అధ్వాన్నంగా వుండేవట! ... కాని...నేను పుట్టిన మూడో రోజుకి మా నాన్నకు అర్ధరూపాయి యింక్రిమెంటు—ఆ పైన మా అక్కయ్య పెండ్లి చేసేందుకుగను మూడువందల రూపాయిల అప్పు దొరికినయట! ... అందుకనే నా పుట్టుకతో నా యిల్లు సౌభాగ్యంతోనూ, ఆనందంతోనూ ప్రకాశిస్తుందని — నా పేరు 'ప్రకాశం' అని పెట్టారు! — అయితే నేను పుట్టిన ఆరు నెల్లకు మా నాన్న—ఆ పైన పదినెల్లకు అప్పుచేసి పెళ్ళి చేసిన మా అక్కయ్య... మా యింటి ఉజ్వల ప్రకాశాన్ని చూడకుండానే గుటుక్కుమన్నారు!' అన్నాడు.

అని ఫక్కున నవ్వాడు ప్రకాశం.

త్యాగరాజు అతడి ముఖంలోకి జాలిగా చూశాడు.

'...సరే! అదంతా తీసివేయండి... ఎలాగో పెరిగాను. మా అమ్మ కష్టపడి నన్నూ మా చెల్లెల్నీ పెంచింది. పెద్దవాళ్ళను చేసింది ... లోకంలో నలుగురి ముందూ 'అవు' ననిపించుకునేలా తీర్చి దిద్దింది!'

ఒక్క క్షణం అతడు మౌనంగా వుండిపోయాడు.

త్యాగరాజుకు—అతడి జీవితానికీ తన జీవితానికీ ఎక్కడో, ఏదో సామ్యం గోచరించగా—ఉత్సుకతో అతడి కథను వినటానికి ఉద్యుక్తుడయ్యాడు! అతడి కళ్ళు ప్రకాశం కళ్ళల్లో దేనికోసమో వెతికినయ్......

అయినా—ఎవరడిగారని అతడు తన కథనంతా చెబుతున్నాడు?

ఏమో?

'చెల్లాయిని నా చేతులమీద పెంచాను.'

త్యాగరాజు అతడి మాటలు వింటూనే గుండెల్ని చేతులతో కప్పుకున్నాడు—దడదడ లాడుతున్నది గుండె!

చెల్లెలు—రాణి!

ఇంకెక్కడి రాణి?

'నేను జీవితంలో ప్రేమించగల వ్యక్తి—నా జీవితాన్నే నా వెన్నంటి ప్రేమించగల వ్యక్తి—ఒక్క నా చెల్లెలే!' అతడి కళ్ళు గర్వంతో మెరుస్తున్నాయి...

త్యాగరాజు కళ్ళు నిస్పృహతో ముడుచుకుపోయాయి.

'ఇంతకీ నా ప్రయాణాన్ని గురించి చెప్పానే గాదు కదూ మీకు?—నా చెల్లెల్ని... నా సుందరిని పుష్పాల్లో పెట్టుకు పూజించే వ్యక్తి—అక్కడెక్కడో వున్నాడంటే మాట్లాడదామని వెళ్తున్నాను!'

'కాదూ...సరదా?' త్యాగరాజు ప్రకాశం కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

'ఏది. ఏం!' ప్రకాశం నవ్వాడు. 'నేను వివరాలన్నీ తెలుసుకొని తీరిగ్గా చెప్పేటప్పటికి అతడికి మరో సంబంధం దక్కుమైపోయింది!'

త్యాగరాజు నిట్టూర్చాడు.

'...నేను నా చెల్లెలి వివాహ విషయంలో ఎందుకు తొందరపడుతున్నా నంటారా?...అంత పెద్ద రహస్యం కాదనుకోండి!...మా చెల్లెలి వివాహం కాందే—నా మటుకు నాకే—నేను వివాహం చేసుకోటం అంత బాగుండదనిపించింది!... అందుకని...ఇంకా...' ఏదో సాగదీస్తూ చెప్పబోయినవాడల్లా ఒక్కక్షణం ఆగి ఫక్కున నవ్వేశాడు. 'అర్థమయిందా గురూగారూ!' అన్నాడు.

అతడి మాటలు త్యాగరాజుకు నవ్వు తెప్పించినయ్.

'...అదీ సంగతి!...' కాస్త ముందుకు వంగి, ఇంకాస్త చొరవ తీసుకుంటున్నట్లుగా, 'మన్లోమాట...ఏ వయస్సులో జరగవల్సినవి ఆ వయస్సులో జరగాలంటాను...ముసలి వయస్సులో వక్కాణ పెళ్ళాం అనటమే వో అమ్మాయి కేమోగాని జీవితం గడపటం అనేది—బహు దుర్భరంగా వుంటుంది మాష్టారూ!...మీరేమంటారు?' అన్నాడు.

త్యాగరాజు ఏమీ అన్లేదు...నవ్వి మాత్రం వూరుకున్నాడు!

'అదుగో మీరు సిగ్గుపడుతున్నారు... అయితే మీకూ వివాహం కాలేదన్నమాట

...వెంటనే చేసేసుకోండి మాష్టారూ ఎందుకైనా మంచిది!

'పోనీ...నష్టమేమిటో చెప్పండి!' అన్నాడు త్యాగరాజు కవ్వింపుగా.

'నా నోరు అసలే మంచిదిగాదు!' ఫక్కున నవ్వి ఒక్క క్షణమాగి, 'ఆ నష్టాలు ఈ నోటిమీదగా చెప్పాలంటే చాలా వెగటుగా వుంటయి— అంతదాకా ఎందుకు? ఒక్కమాటలో చెప్పాలంటే నేను—అందరూ అనుకుండేటట్లుగానే— మంచివాడినిగాను— మంచివాడిని గాకుండా పోవడానికి కారణం నాకు వో మంచి 'ఆడమనిషి' తోడు లేకపోవటమే—నా ఉద్దేశ్యమేస్మీ ఇది!' అన్నాడు కళ్ళు చికిలిస్తూ.

ఈసారి చాలా పెద్దగా నవ్వాడు. ఆలా నోరంతా తెరుచుకు నవ్వటంతో— అతడి గారపట్టిన పళ్ళు చాలా అసహ్యంగా కనబడ్డాయి త్యాగరాజుకు!

ఈ మనిషిలో చాలా దుర్గుణాలు వుండి వుండవచ్చు!' అనుకున్నాడు త్యాగరాజు. అందుకనే అతడితో మాటలు పెంచకుండా గుట్టుచప్పుడు గాకుండా పడుకోవటం మంచిదనిపించింది అతడి మనస్సుకు.

దానికి సూచనగా ఓ తెచ్చి పెట్టుకున్న అవులింత నొకదాన్ని అవులించి, చిటికవేసి, అతడివంక చూస్తూ, 'నాకు నిద్రవస్తోంది మాష్టారూ!' అన్నట్లుగా చిన్న నవ్వు నవ్వాడు.

చాలా ముభావంగా వుండే త్యాగరాజుకు ఈ రోజున ప్రకాశంతో సంభాషణ కాస్త ఎక్కువ మోతాదులోనే జరిగిందనిపించింది—కొద్దిగా పశ్చాత్తాపపడి ఇకజాగ్రత్తగా వుండాలనుకున్నాడు.

'ఇంకేం! నిద్రవస్తున్నదల్లే వున్నది ... హాయిగా గురకపెట్టి నిద్రపోండి!...రేపు అనే దిగులు వద్దు ... ఎందుకంటారా?...నేనున్నాను ... నాకో అద్దెకొంప వున్నది ... నేనూ, నా అద్దెకొంపా మీకు ఉద్యోగం వచ్చేటంతవరకూ సంతోషంగా ఆతిథ్యమివ్వగలం!' అని నవ్వేసి అతనూ పడుకున్నాడు.

ఈ సారి నిజమైన అవులింతే త్యాగరాజును పరామర్శించింది.

'ఇంకో కారణం గూడా చెప్పమంటారా?...' మెడ వంకరగా తిప్పి త్యాగరాజు వైపుచూస్తూ అన్నాడు.

త్యాగరాజు మొహంలో కాస్త చికాకు తొంగిచూచింది.

'ఈ రైలు మిమ్మల్ని హైద్రాబాద్‌కు సవ్యంగా జేరుస్తుందనే నమ్ముతున్నారా?'

ఆశ్చర్యంగా అతడి ముఖంలోకి చూచాడు త్యాగరాజు.

'యాక్సిడెంట్ అయిందనుకోండి ... అప్పుడేం జేస్తారు మీరు?...ఓహో ... మీరేవిటి?...మనమేంచేస్తాం అప్పుడు అందాం!...మరో ప్రపంచంలో...' పకపకా నవ్వసాగాడు: 'అందుకే మాష్టారూ! మనకు జీవితంలో భయం, దిగులూ వుండగూడదు!'

ఆ నవ్వుకు ఆనకట్టలే లేనట్లు ఉరవళ్ళు పరవళ్ళతో అతడినుండి వెలువడుతోంది!

త్యాగరాజు గుండె దడదడ లాడింది.

అతడి నవ్వుకు — పెట్టెలోని వాళ్ళంతా ఒక్కసారి అతడివంకా, త్యాగరాజువంకా విచిత్రంగా చూచారు!

(ఇంకా వుంది)

# ఆదర్శ దాంపత్యం

ముట్నూరి వెంకట వాగీశ్వరరావు



మధ్యాహ్నం పన్నెండున్నర కావస్తోంది. భాస్కరుని కర్కశ కిరణములు జయంత్ మొహాన్ని ఎర్రగా మాడుస్తున్నాయ్. కాని వాటివల్ల నతడణుమాత్రమును బాధపడడం లేదు. కాని అతని మొహం ఏదో పరాజయం పొందిన వానిలా తీవ్రంగా బాధాతప్తమై వున్నది. ఉదయం లేవగానే మంజులతో పడిన సంఘర్షణ అతని అంతరాత్మను యింకా కెలుకుతూనే యున్నది. పాశ్చాత్య నాగరికతా వ్యామోహంతో, అదృష్టవశాత్తు లబ్బిన విద్యాగంధ పరిమళ గుబాళింపుచే మైమరచిన మత్తుతో, కట్టుకొన్న మొగుణ్ని తృణప్రాయంగా తూలనాడిన మంజుల వాక్బాణము లతని గుండెలను చీల్చివేస్తున్నాయ్. తాళి కట్టిన భర్తను నిస్సాకారంగా పరిగణించిన ఆధునిక భారత యువతి సంస్కృతికి ప్రతిబింబంగా ఆవిర్భవించిన మంజుల అనాలోచిత పరుషభాషణములతని మెదడును గాట్లు పడేలా నరుకుతున్నాయ్. ఏ స్త్రీ అయితే కంఠంలో అమృతం పోసి అనురాగంతో తనను పునీతుణ్ణి చేస్తుందనుకున్నాడో, ఆ స్త్రీయే కంఠంలోకాక హృదయంలోనే హాలాహలాన్ని నింపింది. 'స్త్రీ స్వాతంత్ర్యాన్ని మోదించలేని మీ పురుష జాతి అహంకారమును నేను సహించలేను. భగవంతు డనుగ్రహించిన ఉద్యోగం నా పొట్టను పోషించగలదు. ప్రాచీన భారత లలామకుమల్లే మీ పాదసేవ చేయలేను. అటువంటి వారే సనాతన భారతదేశ గ్రామసీమలలో కోకొల్లలుగా యిప్పటికే వున్నారు. వారు మీ అభిరుచులు మన్నించగలరు, అనుగుణంగా మసలుకోగలరు. విద్యావతియైన స్త్రీ కట్టుబొట్టును హర్షించలేని విద్యావంతుడైన పురుషుని నేనుసైతం సహించలేదు. మీకుకష్టంగా వుంటే విడాకులిచ్చేయవచ్చును.'

'విడాకు లిచ్చేయవచ్చును...విడాకులిచ్చేయవచ్చును'—జయంత్ చెవిలో ఆ మాటలు రింగుమంటున్నాయ్.

* * *

మిస్ మంజులా !

'మీరు నిన్న వుదయం సలహా ఇచ్చిన ప్రకారం నా పాదసేవ చేయగల స్త్రీ కోసం సనాతన భారతదేశ గ్రామసీమలలో అన్వేషణకై బయలుదేరాను. విడాకులు నాకు సమ్మతమే అని సంతకంతో సహా వో పత్రం రాసి టేబుల్ సొరుగులో పెట్టాను. నీవు నేరుగా నేనులేకుండానే విడాకులు పొందవచ్చు. అందుకు కావలసిన సహాయం నా స్నేహితుడు లాయర్ కృష్ణమూర్తి నీకు చేస్తాడు. త్వరలోనే నేను నా భావిజీవిత సహధర్మచారిణి 'బట్ నాట్ వైఫ్ ఆర్ మిసెస్'తో మన వూరు వస్తాను. మీరు మోడర్న్ వుమెన్‌లా నాగరికతా లక్షణంగా నిండు హృదయంతో, చిరునవ్వుతో స్వాగతమివ్వగలరని ఆశిస్తూ—

మీ మిత్రుడు
జయంత్ జయంతి.

మధ్యాహ్నం ఒంటి గంటయినా ఇంటికి రాని భర్త గూర్చి ఆలోచిస్తూ ప్రక్కగా పడుకొన్న మంజుల మొహానికి ఫాన్ గాలికి కొట్టుకు వచ్చిన కాగితం మడతలోని అక్షర విన్యాసాలవి!

అనుకోని ఈ సంఘటనకు మంజుల మొహం వివర్ణమయింది. అనేకవిధాలైన ఆలోచనా ప్రవంతులామె అంతఃప్రాక్షిలో సుళ్లు తిరుగుతున్నాయ్. 'ఉదయం నేనన్న మాటలను అంత సీరియస్‌గా తీసికొంటా డనుకోలేదే! విడాకులకు ఏర్పాట్లు చేసాడట! ఊహూఁ చెయ్యని ముప్పాళ రంగనాయకమ్మగారన్నట్లు పురుషుడు అహంకారి అన్నది నా జీవితంలో కూడ నిరూపణ అయిందన్నమాట. అసలు పుణ్యపురుషుడుండడం అసంభవమని

'ఆర్తనాదం' కథలోనే ఆవిడ తెల్పేసింది. అటువంటిది ఎంత అమాయకంగా ఆలోచించాను! సరదాకన్నా సీరియస్‌గా తీసుకొని క్రొత్త పెళ్ళికూతురు కోసం బయలుదేరిన పురుష ప్రవృత్తి ఎంత విచిత్రమైనది! ఛీ! అవకాశం దొరికితే ఇంకొకతెను పెళ్ళాడుటకు సిద్ధపడిన జయంత్ నా భర్త అని చెప్పుకోవడం నాకే సిగ్గుచేటు' ... ఆలోచనా స్రవంతి మూడేళ్ళు వెనుకకు మళ్ళింది.

శోభనం రాత్రి...

'జయంతీ!'

'ఛ! ఆదేం పిలుపు? నా పేరు మంజుల.'

'ఇంటి పేరు జయంతేగా.'

'అయితే మాత్రం?'

'చాలా అదృష్టవంతుణ్ణి మంజులా! నా అభిరుచులకు తగిన విధంగా భగవంతుడు నిన్నను గ్రహించాడు నాకు. నీ విద్యార్హతల్ని వంటింటికి అంకితం చేసేటంతటి కుసంస్కారిని కాను. నీవుద్యోగం మానుకోవలసిన అగత్యంలేదు.'

ఆనాడు తను ఎంతో అదృష్టవంతురాలనని పొంగిపోయింది! ఒకరోజు...

* * *

'మంజులా! సాయంకాలం హాస్పిటల్ నుండి ఇంటికి వచ్చేసరికి నా తల పేలుతుందని నీకు తెలుసు. కాఫీతో రెడీగా ఉండాలని ఇది నూటపదోసారి చెప్పడం. మాట్లాడుతున్నది అర్థమవుతోందా?—' జయంత్ విసురుగా అన్నాడు.

'మీకంటె అరగంటముందు మాత్రమే వచ్చే నేను మీకు సకల సపర్యలు చేయగలనని ఎలా అనుకున్నారు. డియర్? ఆ లెక్కకువస్తే కాలేజీలో అరిచరిచి ఇంటికివచ్చే నాకే మీరు కాఫీతో రెడీగా ఉండడం సబవేమో? ఏమంటారు డార్లింగ్?'—మంజుల నిర్లక్ష్యపు సమాధానం.

'వెరీసారీ మిసెస్! అయినా మనిద్దరి సంపాదనా మన కనవసరమని నా ఉద్దేశం! ఇంటి ప్రక్కన ఒకరుండి గృహకార్యాలు చూచుకుంటే, ఆఫీసులో ఒకరుండి ఇంటిఖర్చు సంపాదించే దొకరుండాలి. కనుక నీ జీవితానికివచ్చే లోటేమీ ఉండదని తలస్తూ, మిమ్మల్ని మీ ఉద్యోగానికి రాజీనామా ఇమ్మని కోరుతున్నాం. జీవితాంతం నిన్ను పోషించే బాధ్యత నాది. లేదా నువ్వే నన్ను పోషిస్తానంటే, నేనే రాజీనామా యిస్తాను. ఇల్లూ, వంటా చూసుకుంటాను. ఎవరో ఒకరు ఇంటిపట్టున ఉండకతప్పదు.'

'ఒక్కనెల జీతంతో గడపలేక అప్పుల పాలయి అవస్థలు పడుతూంటే ఉద్యోగాలు వదలుకోవాలిట.' ఉద్యోగాలు దొరక్క ఉన్నత విద్యార్థులే ఊడిగాలు చేస్తూంటే కలిసొచ్చిన అదృష్టాన్ని జారవిడువమని నోరెలావచ్చింది జయంత్? చూస్తూంటే నీకు మతి చలిస్తున్నట్లుంది! వండర్‌ఫుల్?

'మంజులా!' — గట్టిగా అరిచాడు జయంత్. మళ్ళీ నా పేరులో నన్ను సంబోధించినా, ఏకవచన ప్రయోగం చేసినా సహించేదిలేదు. నిరుద్యోగ సమస్య రావడాన్కి నీలాంటి ఆడవాళ్ళందరూ ఇంటిపట్టున ఉండక, మేముకూడ మీతో సమానమంటూ రోడ్లమీదికి రావడమే కారణం! జీతం చాలకపోతే అప్పో సొప్పో చూసుకొని బ్రతకొచ్చు. అది నీ కనవసరం. నా వంతు డబ్బు సంపాదించడం. నీవంతు ఇల్లూ పిల్లలు. అదృష్టం! ఇంకా పిల్లలు లేరు. రేపుదయమే నీ రిజిగ్నేషన్ ప్రిన్సిపాల్‌కి ఇచ్చి నీడ్యూటీలో జాయిన్ కావచ్చు. తెల్సిందా?—'జయంత్' కర్కశంగా పలికాడు.

'జయంత్! ఉద్యోగాన్కి రాజీనామా ఇచ్చేదిలేదు. ఏదో నల్గురి పెద్దల సమక్షాన మూడుముళ్ళూ వేసినంతమాత్రాన నన్ను మీరు జీవితాంతం పోషిస్తారనే గ్యారంటీ ఏమిటి? నాకా విధానాల్లో అసలు నమ్మకంలేదు. రేపు మనిద్దరి మధ్య పడక విడాకులవరకు వెళ్ళితే...

'దానికి నే నెంతమాత్రం సంకోచించను. మంగళసూత్రంమీద నమ్మకంలేని వాళ్ళతో విడాకులు తీసికోడం ఏమంత కష్టంకాదు. యూ కెన్ డూ ఏజ్ యూ లైక్. మనిద్దరం భార్యాభర్తలుగా వుండాలంటే నీ వుద్యోగం వదలుకోక తప్పదు. నీ ఇష్టం ... అంటూ సీరియస్‌గా కదిలిపోయాడు జయంత్.

* * *

ఇంకో రోజు...

'మంజులా! ఆ ఏప్రన్ ఎక్కడ పారేశావ్? నీ ఇల్లు సర్దడంకాదుకాని నా వస్తువులేవీ సమయాన్కి కన్పించి ఏడవ్వే! ఆ ఏప్రాన్ ఇలా తీసికొనిరా.'

'ఆహా! రోజురోజుకి దాసీదానిలా కన్పిస్తున్నా కాబోలు. మీ ఏప్రాన్‌లు, స్టెత్‌లు సంగతి నాకేం తెలియదు. హాస్పిటల్లోనే మర్చిపోతుంటారు; ఈమధ్య మీ మతి తిన్నగా వుండడం లేదని చాలాసార్లు చెప్పానుగా'—

మంజులా! నీవు నా దాసివి కావు. పాద దాసివి! జ్ఞాపకముంచుకో. నువ్వు ఎం.ఎ. చదువు. కాపోతే ఐ.ఎ.ఎస్. చదువు. కాని నా పాదదాసివి. ఆ ఏప్రాన్‌వెతికి వేగంగాలెస్తే సరి. లేదా నామతి ఎంత తిన్నగా ఉంటుందో చూపిస్తాను.

'డామ్ నాన్సెన్స్. మగవాళ్ళంతాఇంతే. కల్చర్‌లెస్ క్రీచర్స్. ఏప్రాన్ సంగతి నాకుతెలీదు. నాకు కాలేజికి టైమయింది. వస్తా! టాటా'—అంటూ వానిటిబాగ్ ఊపుకుంటూ నిర్లక్ష్యంగా బయటికి వెళ్ళింది మంజుల.

మంజుల వెళుతున్న వైపే చూస్తూ నిలబడిపోయాడు జయంత్.

ఆల్మోస్ట్ బటక్స్‌మీదికి దిగిన చీర, వీపుకి సగనికిమీదుగా కంఠానికి సగానికి క్రిందుగా దిగిపోయి చిన్నపీలికలా వీపుకు చుట్టుకున్న జాకెట్టు కావాలని ఎత్తుగా తయారుచేసుకున్న లింగుముడి ... నడుస్తూంటే నడుందగ్గర పెండ్యులమ్ భంగిమలు ...

జయంత్ అసహ్యంగా బాధపడ్తూంటే ఓసారి వెనక్కితిరిగి చూచింది మంజుల. ఈ మారు మరీ ఘోరం! గుండెలమీద పైటలేదు. బ్రాహోల్డర్స్ జబ్బల మీదుగా జాకెట్లోంచిదిగిఉన్నాయ్. బొడ్డు కన్పిస్తోంది. రోడ్ మీద పోయేవాళ్ళు చూస్తే బాగుండదన్న ఇంగితజ్ఞానం లేకుండా, కనీసం పైటైనా సరిచేసికోకుండా — 'జయంత్! లంచ్ అవర్‌కి ఎవరిచేతనైనా కారియర్ పంపించేయ్! ఆఁ' — అంటూ నవ్వుకుంటూ తిరిగి పోయింది.

# ఆదర్శ దాంపత్యం

మంజుల గతస్మృతు లిలా నెమరు వేసుకుంటూండగా ...

*        *        *

జయంత్ అప్రతిభుడై పోయాడు. 'ఇదేనా నా భార్య ! అయ్యో! భారతీయ సంస్కృతికి సజీవ ప్రతిబింబంగా వెలుగొందగల విద్యావతియైన స్త్రీని పెళ్ళాడానే అని ఎంత మురిసిపోయాను ! ఏమీ నాగరికతా వ్యామోహం ! ఏం బ్రతుకిది? 'అమ్మా! ఏప్రాన్' అనడమే తరువాయి 'ఇదిగో నాయనా! గాభరామనిషి ఒట్టి పిచ్చిసన్నాసి' అంటూ నవ్వుతూ తెచ్చే తల్లిలోని సహనాన్ని చూద్దామనుకున్నానే మంజులలో ! లేదే ! 'లక్ష్మమ్మ! పెన్నులో సిరాపోద్దూ' అనేసరికి 'అలాగే అన్నయ్యా' అనే లక్ష్మిమ్మలోని ఆప్యాయత చూద్దామనుకున్నానే మంజులలో ! లేదే! శ్రమించి సహన విహీనంగా ఇంటికొచ్చిన నన్ను వో దేవతలా సేదదీరుస్తుందనుకున్నానే! లేదే! ఛీ ఛీ ! భార్యట భార్య. ఫలానా డాక్టరుగారి భార్య ఇలా వుంటుందని ఎంతమంది నీచంగా మాట్లాడుకుంటున్నారో?

జయంత్‌లో మంజుల గూర్చి అనుమానాలు రాసాగాయ్.

*        *        *

ఆవేళ సాయంకాలం విశాల మెయిన్ రోడ్‌మీద—

మంజుల వానిటీబాగ్ పట్టుకొని ఒంటరిగా ఎక్కడికో పోతోంది చకచకా. ఆ వెనుకే జయంత్ స్కూటర్‌మీద నిశ్శబ్దంగా అనుసరిస్తున్నాడు.

'ఒరే! ఆవిడని చూడరా ! పిటపిటలాడుతోంది. కొంచం పెద్దదయితే అయింది కాని ఇలాంటి బ్యూటీ ఇంతవరకు చూడలేదురా' — వో కాలేజీ స్టూడెంట్ ఉవాచ మంజుల గూర్చి.

'నాసామి రంగా! దబ్బపండులా ఉంది. ఎక్కడ పిట్టోగాని మన జాతికి చెందేదయే ఉండాలి' — వో త్రాగుబోతు అభిప్రాయం.

'అల్లావిడను చూడవే. నీకెన్నిసార్లు చెప్పినా అర్థం కాదు. అదే మోడర్న్. అలా చీరకట్టడమే అందం ! — తన స్టూడెంట్ రమతో కోస్టూడెంట్ ప్రభ పల్కుతున్న నీతివచనాలు.

రామరామా ! ఎన్నికామెంట్లు నా భార్యగూర్చి. ఛీ ఛీ, విద్యార్థులకు తల్లి అనే పవిత్రభావాన్ని సృష్టించవలసిన కాలేజి లెక్చరర్, పాలుకారే ప్రాయంలో ఉన్న విద్యార్థిని కామోద్రేకిని చేస్తోందే! ఓ నాడు భారత స్త్రీగూర్చి తప్పుగా మాట్లాడినందుకు త్రాగుబోతులు సహితం ఆత్మహత్యలు చేసికొన్న పవిత్రదినాలీనాడు కరువై పోవడాన్కి కారణం ఇదేనేమో ! ముక్కుపచ్చలారని ముగ్ధలను సహితం ప్రక్క దారుల్లోకి లాగుతున్నదీ కాలేజ్ లేడీ లెక్చరర్సన్నమాట, సినిమాల తర్వాత. ఒక్క మంజులే ఏం? మెడికల్ కాలేజిలో సైతం లేడీ ట్యూటర్ శర్మిష్ఠ ఆల్మోస్ట్ దిగంబరంగానే వస్తుంది. కాక ఆవిడని సగానికిపైగా కాలేజి స్టూడెంట్లు ప్రేమిస్తున్నారట ! ఆవిడకది గర్వకారణమట. హయ్‌రే! మొగుడి ప్రేమానురాగాల్ని పొందలేని స్త్రీ పదిమందిచేత అందకత్తె అనిపించుకోవడమేనా సంస్కారం? అటువంటి స్త్రీ స్త్రీయా? వ్యభిచారిణా?'

ఒక దేశంయొక్క సంస్కృతి ఆదేశ స్త్రీ కట్టు బొట్టు మీద విశేషంగా ఆధారపడి ఉంటుందనేది నిస్సందేహం. ఇలా వివాహితలైన స్త్రీలు సహితం జుగుప్సాకరంగా ప్రవర్తించడాన్కి కారణం ఒక్కటే, 'కౌతుకొద్దీ గుర్రం'! తమ భార్య లెంత 'మోడర్న్'గా వుంటే అంత 'సివిలిజేషన్' అనుకునే 'ప్రెజెంట్ ఎడ్యుకేటెడ్ జంటిల్మెన్' అభిరుచులే దీనికి కారణం. అందరి భార్యలను సంస్కరించలేకపోయినా నా భార్యను నేను సంస్కారవతిని చేయాలి! సంస్కరించుకోవాలి!'...' ఆలోచిస్తూ మంజుల లక్ష్మీ టాకీసుకు వెళ్ళడం చూసి, తను వెళ్దామనుకొని ఆ ప్రయత్నంనుండి విరమించుకున్నాడు జయంత్.

*        *        *

మంజుల గతస్మృతులలో......

ఆ మర్నాడుదయం......

'మంజులా! ఒక్క మాట. నీ వుద్యోగం మానక్కర్లేదు గాని నీ ప్రవర్తన కొంచెం మార్చుకోవాలి. నీవిప్పుడు వాడుతున్న జాకెట్లన్నీ తక్షణమే తగులబెట్టు. నీకు ఈ క్షణంలో అరవంద జాకెట్లు కుట్టిస్తాను. కాని నా అభిరుచికి అనుకూలంగా. ఎవరి అభిరుచి ప్రకారం వాళ్ళు నడచుకుంటారని నువ్వనవచ్చు. కాని నీ భర్తగా నిన్నో విధంగా చూడాలని నాకుంటుంది. అందుకే ఈ మాట. అలాగే నీకు కూడ నన్నో రీతిలో చూడాలని వుండొచ్చు. తప్పకుండ నీ అభిప్రాయం మన్నిస్తాను. కావలస్తే పంచె, లాల్చీ తొడుగుతాను. కాని గుడ్డపీలికల్లాంటి ఆ జాకెట్లలో



ఎంత అసహ్యంగా ఉన్నావో తెలుసా? నీగూర్చి నల్గురూ ఎలా మాట్లాడుకుంటున్నారో తెలుసా' — జయంత్ మాటలు పూర్తి కాకముందే—

'ఆపండి మీ ప్రసంగం! ఎలా మాట్లాడుకుంటున్నారో తెల్సుగా. రంభగా వుందన్నారు. లేదా! మీ కంటికి నేను అసహ్యంగా కన్పించవచ్చు. ఎందుకంటే రెండేళ్లు అనాటమీలో రక్తం లేని శవాలను కోసారు కదూ! మరో మూడేళ్లు జీవంలేని రోగుల బాధలు చూసారు కదూ! మీకే దేహంమీద విరక్తి కల్గింది. మీ కంటికి అంచేత అందగాళ్ళు కూడ వికారంగానే కన్పిస్తారు. నిజానికి మీరో వేదాంతిగా మారి రామకృష్ణమఠంలో చేరవల్సింది. ఎం. డి. చదివినవాణ్ణి కట్టుకొంటున్నాననే ఆనందంతో కళ్ళు మూసుకుపోయి ఓ ఆడదాని కట్టుబొట్టును అర్థం చేసికోలేని ఓ కుసంస్కారిని వివాహం చేసికొన్నానని ఇప్పుడేడుస్తున్నాను. కాకపోతే స్త్రీ సహజం విద్యావతి అని తలంచకుండా నీతులు నేర్పడం. మీ కోరికలను నేను మన్నించలేను. కాని నా కోరిక మన్నిస్తానన్నారుగా. రేపట్నించి గోచీ కట్టి హాస్పిటల్కు వెళ్లండి. మిమ్మల్నిలా చూడడం నా కెంతో ఇష్టం'— మంజుల సమాధాన వైఖరి.

'మంజులా! కళ్ళు మూసుకుపోయి యుక్తాయుక్త జ్ఞానహీనంగా ప్రవర్తిస్తున్నావ్. ఓ విషయం గుర్తుంచుకో. నేను దిగంబరంగా వీధిలోకి వెళ్ళినా నన్ను పిచ్చివాడనుకొని ఎవరి మానాన వాళ్ళు పోతారు. కాని నాగూర్చి ఎవరూ పట్టించుకోరు. ఇది ప్రకృతి మంజులా! స్త్రీ వస్త్రధారిణై వెళ్తేనే నీగూర్చి లోకం నాల్గురకాలుగా మాట్లాడుకుంటోందే, అటువంటిది అసభ్యవస్త్రధారిణిగా వెళ్తే ఇంకెలా అనుకుంటుందో ఈలోకం ఊహించావా? అదీకాక స్త్రీకి మానం మహా ముఖ్యం. మనం బట్టలు ధరించేది మాన రక్షణకోసం కాని అంగప్రదర్శనకు కాదు.

'ఈ మాటలు జాగ్రతగా విను. ఇక మీదట నువ్వు బొడ్డుమీదికి చీరకట్టుకొని నిండుగా పైట కప్పుకొని నయాపైసంత బొట్టు పెట్టుకొని మాత్రమే కాలేజీకు వెళ్ళాలి. లేదా నిన్నిలా మార్చగల పురుష బలసంపద విజృంభించక మానను. తెల్సిందా.'

'ఛీ! ఇన్నాళ్ళు మిమ్మల్ని సంస్కారవంతుడనుకున్నాను. ఇదేనా మీసంస్కారం?' స్త్రీ స్వాతంత్ర్యాన్ని మోదించలేని మీ పురుషజాతి అహంకారమును నేను సహించలేను. భగవంతుడిచ్చిన ఉద్యోగం, నా పొట్టను పోషించగలదు. సనాతన భారతస్త్రీలా మీపాద సేవచేయలేను. అటువంటివారే భారతదేశ గ్రామసీమలలో కోకొల్లలు. అట్టివారే మీ చరణదాసులు కాగలరు. విద్యావతియైన స్త్రీ కట్టుబొట్టు నామోదించలేని వివేకియైన పురుషుని నేను సైతం భరించలేను. మీకు కష్టంగావుంటే విడాకు లిచ్చేయండి కాని నన్నిలా వేధించకండి' — మంజుల అతి తీవ్రంగా అని అదే తీవ్రతతో కాలేజీకి వెళ్ళింది.

'ఈ మాటలనే ఇంత సీరియస్గా తీసికొన్నాడన్నమాట. విడాకులకు అరేంజ్'

చేసాడట. కాని, ఎలా జరగవలసినదలానే జరుగుతుంది'— అనుకుంటూ మంజుల నిద్రలోకి జారిపోయింది.

*  *  *

జయంత్, మంజుల విడాకులు తీసికొన్నారు. విడాకులు తీసికొన్న రెండు రోజులకే జయంత్ రమాప్రభ అనే ఓ పాతికేళ్ల స్త్రీని తన భార్యగా ప్రకటించి స్వంతఇంటికి వచ్చేసాడు. మంజుల వేరేయింటిని అద్దెకు తీసికొని గడప సాగింది.

'మన జయంత్ బాబుగారు లేరూ! పెళ్ళాంతోపడక విడాకులు తీసికొని ఎవర్తినో గుళ్ళో పెళ్ళిచేసికొని ఇంటికి తెచ్చాడుట. ఇదేం కాలమమ్మా! అతనికి మంజులమ్మవల్ల పిల్లలు లేరట. అంచే తనే రెండో పెళ్ళి చేసికొన్నాడట'— మంజుల, జయంత్ లుంటున్న వీధిలోని ఓ కామాక్షిగారి వ్యాఖ్య!

'నీకేం తెలియదు లేవే! అసలు మంజులమ్మగారే బాబుగారినుండి విడాకులు తీసికొన్నారుట. బాబుగారంచేతనే రెండో పెళ్ళి చేసికొన్నారు. క్రొత్తపెళ్ళాం వీధిలోకి వచ్చినపుడు నేను చూసానులే. ఆవిడకూ, ఈ ఏడకూ పోలికలే లేవు. ఈ విడ సాక్షాత్తు మా లక్ష్మిలా తెలుసా' ఓ మీనాక్షి ఘోష.

'అనకూడదు కాని మంజులమ్మ సాని దానికంటె కనాకష్టం. ఏమోగాని ఏమంత

# ఆదర్శ దాంపత్యం

మంచిగుణం కలదిలా కన్పించేదికాదు. బాబుగారంచేతే వదిలేసారని అంటున్నారు. ఇద్దరికి రోజూ దెబ్బలాటలేనట'—ఓ విశాలాక్షి విపులీకరణ.

'కాలం మారిపోయింది పిన్నీ! ఈమధ్య ఓ హీరోగారు ముగ్గురు పిల్లలూ, పెళ్ళాన్నీ వుంచుకొని, పిల్లలున్న ఇంకో సినిమా ఆడదాన్ని పెళ్ళాడుట. దానికే బుద్ధిలేపోతే దీనికైనా వుండొద్దూ. మా రంగడు చెప్తే విన్నాను, అదేంటో విడాకులట. బాబుగారూ విడాకులేనట. మరీ కలికాలం, దొంగ చచ్చినోళ్ళు. ఇంకా బాబుగారే నయం ఏమంటావ్ మీనాలు?'— ఓ కమలాక్షి వేదాంతం.

అందరిమాటలు విని మంజుల ఫడీమని తలుపులు వేసికొంది వీధిలోకి బయలు దేరినదల్లా పంపుదగ్గర ఆడవాళ్ల చురకలు తగిలి.

*  *  *

ఓ రోజు సాయంకాలం మంజుల షోగ్గా టెర్యార్లై స్టైయిల్‌గా చిత్రాలయ వైపు పోతోంది. ఆమెదగ్గరే చదువుకుంటున్న ఓ కాలేజీ స్టూడెంట్, గజనీ జాతికి చెందినవాడు ధైర్యంచేసి మంజుల ప్రక్కగా వచ్చాడు.

'మాడమ్! ఇలా చూడండి చిన్న మాట. మాతో ఒ విషయం మాట్లాడా లనివుంది మరేమీ అనుకోనంటే...

'ఫర్వాలేదు రఘూ! చెప్పు నీకేం భయంలేదు.'

'ఆఁ అదికాదండి. మీరెలాగు డైవర్స్ తీసికొన్నారు. నేను పెళ్ళి చేసికొందా మని...

'షటప్' ఇలాంటి వెర్రి వెర్రివేషాలు వేసావా కాలేజీనుండి డిబార్ చేయిస్తాను. గెటవుట్'—పిచ్చిగా అరిచింది మంజుల.

'మొగుళ్ళొదిలేసినా, జాలాయిగా తిరిగే ఆడాళ్ళకూ టెంపరే' — అనుకుంటూ రఘు చల్లగా జారుకున్నాడు.

దసపల్లా చిత్రాలయలో...

సీట్‌నంబరింగ్ అలారావరంలో జయంత్ మంజులకు రమకు మధ్య కూర్చున్నాడు హాల్లో. మంజుల బాధగా చూసిందికాని ఏమీ చెయ్యలేకపోయింది. స్క్రీన్‌మీద రేఖా అండ్ మురళీవారి దేవత అనే అక్షరాలు తెల్లగా కన్పించాయి. జయంత్ మంజుల భావాలను పరీక్షిస్తూ కూర్చున్నాడు.

'అలయాన వెలసిన ఆ దేవునిరీతి ఇల్లాలే ఈ జగతికే జీవనజ్యోతి—' అనేపాట మనోజ్ఞంగా ప్రతిధ్వనిస్తోంది థియేటర్‌లో.

'ఏమండి! సావిత్రి అచ్చం దేవతలా వుండేది?'— రమ మనోహరంగా అడిగింది జయంత్‌ను.

'చూసావా రమా! నేను చాల అదృష్టవంతుణ్ణి. అటువంటి దేవతనే చిన్నప్పటినుండి నేను కోరుకున్నది. శ్రీవారికి సమస్త సపర్యలు, అనురాగం, అత్తమామలకు అనుక్షణం సేవలు... నీవు నాదేవతవే'... జయంత్ మాటలు.

'పొండి మరీనూ'—రమ సిగ్గుతో ముడుచుకుంది.

మంజుల రుసరుసలాడుతూ రూమ్మని బయటకు వచ్చేసింది.

*  *  *

ఇంటికి వచ్చిన మంజుల మనస్సు పరిపరి విధాల పోతోంది.

'తొందర పడ్డానేమో నాతప్పా వుంది. ఛీ ఛీ' పోని ఇప్పుడుపోయి క్షమాపణ కోరుకుంటే ప్రయోజనంలేదు. పాపం



జయంత్ మంచివాడే. ఎంత సాత్వికంగా అతడు ప్రవర్తించినా తను దురుసుగానే వ్యవహరించింది. ఇంతేనా నాజీవితం! ఇలా వివాహిత కన్యగా ఉండిపోవడమేనా? నేను చేసిన పాపానికి నిష్కృతిలేదు. రత్నంలాంటి భర్తను తూలనాడి హిందూ సంఘాన్నే కల్మషం చేసానే! ఇదేనా నా సంస్కారం? ఇదేనా నా విద్యార్హతలకు ప్రమాణం? ఎంత అవివేకంగా ప్రవర్తించాను. ఇలా జీవితాంతం ఒంటరినే అన్నమాట. ఏ భర్తయినా తన భార్య ఓ దేవతలా ఉండాలని కోరుకుంటాడు. అదే స్వార్థం జయంత్ లోనూ వుంది .అటువంటి స్వార్థమే పురుషులకు లేకపోతే స్త్రీ పతితగా మారడానికి క్షణాలు పట్టవుకదా. జయంత్ ఈ మూడేళ్లలోను తనని తీవ్రంగా ఎదిరించుకోలేదు. కొట్టలేదు, కనీసం తిట్టలేదు కూడాను. అందరికీ ఇట్టి భర్త లభిస్తాడా? తన కట్టుబొట్టును అతనెపుడూ విమర్శించలేదే! నాగరికతా ముసుగులో తనే పడిపోయింది. ఉత్తమ సలహాలిచ్చిన ఆత్మీయుణ్ణే పోగొట్టుకొన్నాను'... ఇలా ఆలోచనా ప్రవాహాలలో మంజుల మెదడు తేలిపోతూ వుంది.

సరిగ్గా రాత్రి పది అయింది. మంజుల ఆలోచనలు ఓ నిర్ణయాన్కి రాకముందే తలుపుమీద టక్ టక్‌మని చప్పుడయింది. మంజుల తలుపు తీసింది. వెంటనే రఘు లోపలికి జొరబడి తలుపువేసి మంజులను హదివి పట్టుకున్నాడు.

'మేడమ్! మిమ్మల్ని చూసి పిచ్చివాణ్ణయాను మేడమ్. మీరెలాను అవివాహితులే ఇప్పుడు. నన్ను కాదనకండి మేడమ్. నా కోరిక తీర్చండి మేడమ్' —అంటూ రఘు ఆమెను పిచ్చిగా కౌగిలించుకున్నాడు.

మంజుల ఎక్కడలేని బలం తెచ్చుకొని రఘును దూరంగా త్రోసింది. ఆ పోటుకు రఘు నుదురు చిట్లింది. 'మేడమ్! మిమ్మల్నివాళ నా స్వంతం చేసికోంటే గాని కదిలేదిలేదు'—అంటూ రఘు లేవబోయాడు. అప్పటికే మంజుల జాగ్రత్త పడింది. చేతికందిన కంచు గ్లాసును విశితంగా రఘుమీదికి విసిరింది. అంతే?

రము తలకు తీవ్రమైన గాయమై మూర్ఛపోయాడు.

'బతుకు జీవుడా! బతికానను కుంటూ తలుపు తెరవగానే పాటి లెక్చరర్ చంద్రశేఖరం సుత్తుగా కన్పించాడు మంజులకు. అంతకుముందునుండే స్టాఫ్ రూంలో చంద్రశేఖరం మంజులను కొరుక్కు తినేవాడిలా చూసేవాడు కాక అసభ్య భాష. మంజుల సహించలేదు. ముందూ వెనకా ఆలోచించకుండా వీధిలోకి పరుగుతీసింది. నిశ్చితంకాని గమ్యంవైపు, మంజుల! ఆమె ఎంత వేగంగా పరుగుతీస్తోందో, అదే వేగంతో ... అంతకంటె ఎక్కువ వేగంతో ఆమె మెదడులో ఆలోచనలు పరుగుతీస్తున్నాయ్.

'చచ్చిపోయేముందు జయంత్ నోసారి క్షమాపణ కోరాలి. లేకపోతే నా జీవితానికి నిష్కృతిలేదు. భర్త అనురాగాన్ని పొందికూడా, భర్తను నిర్లక్ష్యంగా నిరాదరించిన నాకి ఆత్మహత్య ఏమంత పెద్ద శిక్షకాదు. విడాకులగూర్చి ప్రస్తావించినది నేనే. ప్రోత్సహించి కవ్వించినది తనే! అది కేవలం తుంటరితనం తప్ప

# ఆదర్శ దాంపత్యం

నా హృదయంలో మాలిన్యం లేదని జయంత్‌కెలా చెప్పడం? కనీసం జయంత్ తన మొహాన్నయినా చూస్తాడా? ఎలా క్షమాపణ కోరేది? జీవితాన్కి అర్థం ఇదేనా? క్షమిస్తాడు. తప్పక క్షమిస్తాడు. జయంత్ నిగ్రహవంతుడు. క్రోధహీనుడు. సంస్కారి. జయంత్ క్షమిస్తే చాలు తాను పుణ్యవతే! పవిత్రమైన భారతస్త్రీగా జన్మించికూడ ప్రత్యక్షదైవమైన భర్తను విడనాడావే! ఎంత పాశ్చాత్య నాగరికతా వ్యామోహం! దాని ఫలితం? సంఘంలో నీచాతినీచంగా పరిగణింప బడుతున్నావే. నేను అగ్నికీల వలె విశుద్ధనని ఎలా తెలియపర్చడం ప్రపంచానికి. నన్నర్థం చేసికోని ఆటి స్త్రీల నిందలనెలా బాపుకోవడం? నన్నెంత హీనంగా సంఘం గుర్తించింది? ఈ హీనత నన్ను దహించి వేయకముందే నేను దహింపబడాలి. నేను దహింపబడాలి.'

ఆ వేగంతో రొప్పుతూ జయంత్ తలుపులు దబదబ బాదింది మంజుల. జయంత్ తలుపులు తెరిచాడు.

'నన్ను క్షమించండి ఒక్కసారి నన్ను క్షమించానానండి! నన్ను అగ్నిసాక్షిగా మొదట పెళ్ళాడినందుకైనా నన్ను క్షమించానానండి ప్లీజ్ అనరూ! ఒక్కమాట అనండి. నా ఈ జీవితాన్కి నిష్కృతిలేదు. మిమ్మల్ని మూడేళ్ళు హింసించాను. ఒక్కసారి క్షమించానానండి. ఒక్కసారి క్షమిస్తే మిమ్మల్ని మరెప్పుడూ బాధించను. ప్లీజ్! క్షమించానానండి!'

మంజుల హృదయ విదారకంగా ఏడుస్తూ జయంత్ కాళ్ళను పిచ్చిగా చుట్టేసుకుంది.

ఊహించని ఈ పరిణామానికి జయంత్ మొదట విచలితుడైనా, వెంటనే తేరుకొని, 'మంజులా! ఏమిటలా మాట్లాడుతున్నావ్? నిన్ను క్షమించడం ఏంటి? ఇంట్లోకి పద. ఏదో పెద్ద దెబ్బ తిన్నట్లున్నావ్' — అంటూ లేవనెత్తాడు.

'అయ్యో! ఇంట్లోకి రమ్మంటున్నారా! ఆ అర్హత నాకు లేదే! ప్లీజ్, క్షమించానండి, నామానాన నేను పోతాను.' అంటూ మళ్ళీ కుప్పలా కూలిపోయింది జయంత్ కాళ్ళమీద.

'అరే! మంజులా! నిన్నే ఏమిటీ పిచ్చి ఇంట్లోకి నడు మొదట' — జయంత్ క్వశ్చన్‌ఫేస్ ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు.

'క్షమించండి. అంతవరకు మీ కాళ్ళు వదిలేదిలేదు నాకు తృప్తిలేదు.'

ఏదో పెద్దషాక్ తగిలిందని జయంత్ గుర్తించాడు.

'క్షమించాను మంజులా! లే'—అంటూ మంజులను హృదయాన్కి పొదివి పట్టుకొని ఇంట్లోకి తీసికొని వెళ్ళాడు.

'ఇక నన్ను వదిలేయండి మీరు క్షమించారు అదే చాలు. వచ్చేజన్మలో మీ చరణ దాసిగాపుట్టి మీ రుణం తీర్చుకుంటాను. శలవ్'—అంటూ వెళ్ళిపోయింది మంజుల.

'మంజులా! ఏమిటాపిచ్చి? నువ్వెళ్ళితే ఈ ఇంట్లో నాకు తిండిపెట్టే దెవరు?

నా ఆలనాపాలనా చూసేదెవరు? నే నెవరి కోసం ఈ ఉద్యోగం చేయడం? ఇది మన ఇల్లే మంజుల. నీవు నావానవే'— అంటూ హృదయాన్కి తీసికొన్నాడు జయంత్.

'మరి...మరి...రమ...' ఆనందంతో మంజుల నోరు తడబడంది.

'పిచ్చి మంజులా! మన సంస్కృతిని మంట గలిపేటంతటి కుసంస్కారిని కాను నేను. ఇదంతా నీకు బుద్ధి రావడానికి నే నాడిన నాటకం. విడాకులువట్టి బూటకం. రమ ఎవరోతెలుసా మీ శ్యామల పిన్నికూతురు. నాతో చదువుకునేదిగా. ఈ డ్రామాలో హెల్ప్ చెయ్యమన్నాను. అక్కయ్య తిక్క కుదిరిస్తానంటూ వచ్చి మకాం వేసింది. నీ బాగోగులను అను క్షణం నేను చూస్తూనే వున్నాను. ఈపాటికి మీ చంద్రశేఖరంగారు పోలీస్ స్టేషన్‌లో వుంటారు. ఇప్పుడు నీవు మంజులవు కావు నీవు దేవతవయ్యావు.' అలాగే హృదయంలో — ఒదిగిపోయింది మంజుల.

* * *

ఆ మర్నాడే మంజుల తన ఉద్యోగాన్కి రాజీనామాఇచ్చి గృహ కృత్యాలలో జొరబడింది. తెల్లవారిన తర్వాత ఏడున్నర గంటలకు లేచిన జయంత్ మంజులను అపర సరస్వతిలాచూసి ముగ్ధుడయ్యాడు. శరీరంనిండా మధుర పట్టు చీర చుట్టుకొని కాళ్ళకు పెళ్ళినాటి మట్టెలుపెట్టుకుని మెడలో నల్లపూసలు, కుత్తిగంటె, జెర్రిపోతులాంటి మంగళ సూత్రం వేసికొని, తలంటుకొని దేవత సినిమాలోని దేవతలా ప్రత్యక్షమయింది కాఫీ గ్లాసుతో. జయంత్ ఆనందంతో ఉక్కిరి బిక్కిరయ్యాడు. పెన్నాదులు ముగించి ఆంధ్రత్వాన్ని ప్రకటించేపంచె, లాల్చీలో జయంత్‌నుచూసి మంజుల ఆనందంతో పొంగిపోయింది. పాశ్చాత్య సంస్కృతికి బానిసగా మారబోతున్న ఓ ఆంధ్ర కుటుంబాన్ని మళ్ళీ స్వసంస్కృతివైపు మళ్ళించానే అనే గర్వంతో ఆ ఆదర్శ దంపతులను చూస్తూ నిలబడి పోయింది రమ. ●

రంగుల రాట్నం

# దోమ

డిమ్మికోనేటిరావు




ఇది మన ఒకటో నెంబరు శత్రువు అన్నా తప్పులేదు. మన పరిసరాల్లో విచ్చలవిడిగా తిరుగుతూ, రక్తాన్ని పీల్చడమే కాకుండా, మనకు బోదకాలు, మలేరియా మొదలైన జబ్బుల్ని అందజేస్తుంది.

ముఖ్యంగా రెండు మూడు జాతుల దోమల్లు మనకు ఈ అపకారాన్ని చేస్తాయి. ఎనాఫిలస్ దోమ మలేరియా, క్యూలెక్సు దోమ బోదకాలు, క్రిముల్ని రక్తంలో ప్రవేశపెడతాయి. మరో ముఖ్య విషయం. ఈ పనంతా ఆడదోమ పనే. మగదోమలు పాపం బయటనే చెట్లరసాలతో తృప్తి పడతాయి. ఆడవాటికే వేడిరక్తం అవసరం. అదిలేకపోతే వాటి సంతానోత్పత్తి సక్రమంగా జరగనట్లు ఉంది. పైగా దోమ సంగీతం, దోమలకు శ్రవణానందమేమో కాని మానవులకి భరింపరాని వేదన కల్పిస్తుంది. రాత్రిళ్ళు నిద్రపట్ట నీదు కూడా. శ్వాసరంధ్రాలు పై పొరల కంపనంవల్ల ఈ శబ్దం ఉత్పన్నం అవుతుంది.

దోమల నోటి అవయవాలు ఘోరమైనవి. కత్తులు, కటారులతో ఉంటాయి. ఇంజక్షను సూదిలా చర్మంలోకి పోయి, రక్తాన్ని పీల్చుకొంటాయి ఈ అవయవాలలో కొన్ని.

మన మంచికే మనం దోమల జీవనవిధానం, అలవాట్లు లోటుపాట్లు తెలుసుకోవాలి. దాని జీవిత చక్రం నాలుగుదశల్లో జరుగుతుంది. వాటిని గుడ్డు, లార్వా, ప్యూపా, ఇమాగో [ఎదిగినది] అంటారు. ఈ దశలన్నిటిలోనూ ఆయా జాతుల దోమలను వేరుచేసి చెప్పవచ్చు. స్థిరమైన నీటి గుంటల్లో దోమలు గుడ్లు పెడతాయి. పెరట్లో, డబ్బాలో నిలవనీళ్ళ నూతులు, ప్రవాహం ఆగిన కాలవనీళ్ళు కూడా అనుకూలమే. నీటినుంచి లార్వాలు వస్తాయి. అవి నీటిలోఉన్నా, పైగాలి శ్వాసకు కావాలి.

చిన్న పురుగు గుల్లా క్రిందకు మీదకు తిరుగుతూంటాయి.ఆహారం తీసికొని ఎదుగుతాయి. ఈ స్థితిలో సులభంగా వీటిని చంపవచ్చు. వీటి నుంచి ప్యూపాలు వస్తాయి. అదీ దరిదాపు అదే స్థితి కాని ఆహారం తీసికోలేదు. దీని తరువాత, దోమరెక్కలతో బయటకు వస్తుంది.ఇదంతా 15 రోజుల్లో జరుగుతుంది.

నీటి విషయంలో జాగ్రత్త తీసికోడంతో సగంపైగా నీటి బెడద వదుల్తుంది. కొన్ని చేపలు, లార్వా పూపా దశల్ని చాలా ఇష్టంతో తింటాయి. నీటిపైన నూనె పదార్థాలు [కిరసనాయిలు మొ.] జల్లడం వలనకూడా అవి వూపిరి పీల్చుకోలేక చచ్చిపోతాయి.

కొత్తగా పుట్టిన దోమలు కుడితే, మలేరియా బోదకాలు జ్వరక్రిములు మనలో ప్రవేశించవు. అవి రోగుల్ని కుట్టాక, వాటి శరీరంలోకి రోగులనుంచి క్రిములు వస్తాయి. కొంతకాలం జరిగాక ఇవితిరిగి కొత్తగా మానవుల్లో ప్రవేశించడానికి సిద్ధమవుతాయి. ఈ కారణంచేత రోగుల్ని కూడా దోమకాటుకు గురి కానీయకూడదు!




### జరిగిన కథ

సుధాకర్‌కి మగపిల్లాడు బాబ్జి, ఆడపిల్ల మున్ని వున్నారు. భార్య పోయింది. ఆ స్థానంలో లలిత వచ్చింది. రెండో పెళ్ళివాడు అనగానే ఆమె ఆదిలో అనేక రకాలుగా వూహించుకుంది. కాని, పెళ్ళయ్యాక ఆ అపోహ అంతా తొలగిపోయింది. సుధాకర్ ఆమెని పువ్వుల్లో పెట్టుకుని పూజిస్తున్నాడు. జీవితం మధురంగా గడిచిపోతోంది. సుధాకర్ చెల్లెలు అరుణ చూడ్డానికని వాళ్ళింటికి వచ్చింది. ఎంతయినా ఆడబిడ్డకదా, ఆమె పేరు నిలబెట్టుకునే వెళ్ళింది. పిల్లలిద్దరికీ తల్లి స్థానాన్ని పూర్తిగా నింపింది లలిత. సుధాకర్‌కి కావలసింది అదే. సుధాకర్ సంపాదన చాలకపోవడాన్ని గ్రహించి తనుకూడా ఉద్యోగంలో చేరింది లలిత. రానురాను ఇద్దరితో మనస్పర్థలు ఎక్కువ కాసాగాయి లలిత అతన్ని విడిచిపెట్టి వెళ్ళిపోక తప్పింది కాదు. విమలాదేవి ఆదరించి లలితని ముగ్ధురాల్ని చేసింది. విమలాదేవి కథ ఆమెని మరింతగా ఆశ్చర్యపరచింది.

# 10

కాలచక్రం రోజులూ వారాలూ నెలలూ సంవత్సరాల మీదగా దొర్లిపోయింది.

నేను గవర్నమెంటు సర్వీస్‌లో చేరటం పరీక్షలు పాసయ్యి చాలా త్వరగా ప్రమోషను రావటం కూడా జరిగిపోయింది. యింటి పరిస్థితులు చాలావరకూ మెరుగు పడ్డాయి. కానీ కట్నం లేకుండా ఒక లారీ డ్రైవర్ అక్కయ్యని చేసుకోవటానికి యిష్టపడ్డాడు. అన్నయ్య తమ్ముడి గురించి పట్టించుకుని బాధ పడటం అనవసరమేనని ఏనాడో వదిలేసాం. తెగిన గాలిపటాలని పట్టుకోవాలని ప్రయత్నించటం వృధా శ్రమ. ఎప్పుడో వాళ్ళిష్టమైతే వస్తారు. వున్నదేదో తింటారు. ఒకోసారి అమ్మకి కాస్త కూస్త డబ్బులిచ్చేటే యిస్తాడు. వాళ్ళకి అవసరమైతే అందరితో పోట్లాడి దొరికినవి తీసుకుని వెళతారు. చిట్లపేక జోరుగా సాగే ఒక హోటలులో అన్నయ్య వుండేవాడు. తమ్ముడు అలాగే తిరిగేవాడు. రెండవ తమ్ముడు ఆ సంవత్సరమే పాలిటెక్నిక్ పాసయ్యి ఉద్యోగంలో చేరాడు. చెల్లెలు ఒక్కర్తే చదువుకుంటోంది. అమ్మ పూర్తిగా కోలుకోలేకపోయినా కొంత లేచి తిరగకలుగుతోంది. నడుగూ బొడుగూ లేని ఆ గుమాస్తా ఉద్యోగమే అయినా నాన్న నిశ్చింతగా బండి లాక్కొని వస్తున్నారు. కనకం చెల్లెలు తిరిగివచ్చి బాగా డబ్బున్న ఒక వృద్ధుడ్ని పెళ్ళి చేసుకుంది. అత్త కుటుంబం అక్కడికి తరలి వెళ్ళటంతో పెద్ద బాధ వదిలింది.

జీవితంలో కూడా స్థిరపడటమే అన్ని విధాల మంచిదనిపించింది నాకు. కులం తక్కువవాడని అమ్మా నాన్నా లోలోపల బాధపడుతున్నా నేను పట్టించుకోలేదు. వచ్చిన అవకాశాలని వినియోగించుకోలేక పోవటం అవివేకమే అవుతుంది. అతను కట్నం కానుకలకి ఆశపడలేదు. నన్ను నన్నుగా ప్రేమించి గౌరవించి అభిమానించి పెళ్ళి చేసుకుంటానన్నారు. అవసరమైతే మా వాళ్ళని నేను ఆదుకోవలసి వస్తుందని మా చెల్లాయిని చదివించి పెళ్ళికి ఆర్థికంగా సహాయం చేయాల్సి వుంటుందనీ మా పరిస్థితి విప్పి చెప్పాను. మా పుట్టింటివాళ్ళకి నేనెలాంటి సహాయం చేయాలనుకున్నా తన పూర్తి సహకారం లభిస్తుందని హామీ యిచ్చారు.

నిరాడంబరంగా మా అక్కయ్య పెళ్ళి జరిగింది. ఆ తరవాత కొద్దిరోజులకే దేవాలయంలో మా పెళ్ళి అయ్యింది. అందరూ నాన్న కష్టాలు తీరిపోయాయని అందరితోకీ మొదటినుండీ తెలిసినట్లు దాన్నని నా అదృష్టాన్ని పొగిడారు.

కన్నవారింట్లో ఎన్ని యిబ్బందులు పడినా రక్తం పంచుకున్నవారితో కష్టనష్టాలని కలిసి పంచుకోవటం యిబ్బంది అనిపించదు. కానీ వివాహం అయిన క్షణం నుండీ స్త్రీ జీవితం మలుపు తిరుగుతుంది. పంచుకోవలసిన భర్త బాధకి కారణం అయితే యింకా ఎవరికి చెప్పుకుంటుంది ఏ ఆడదయినా?

నన్ను ప్రేమించానని పెళ్ళి చేసుకున్న ఆయన కొద్దికాలానికే చిత్రంగా మారిపోయారు. నా వలనే వాళ్ళ అమ్మగారికి నాన్నగారికి దూరమయ్యానని బాధపడే వారు. నీకోసం నేను నా వాళ్ళందరినీ వదులుకుంటే నువ్వు నీ పుట్టింటివారి సౌఖ్యం తప్ప నన్ను సరిగ్గా చూడటంలేదు. సంసారం అంటే శ్రద్ధ లేదని విసుక్కునే వారు.

ఒక్క పైసాకూడా ఈ యింటినుండీ ఆ యింటికి వెళ్ళకూడదు. ఆ యింటి కాకికూడా ఈ యింటిమీదకి వాలటానికి వీల్లేదని కట్టడిచేసే స్థితికి వచ్చారు చివరికి.

తన ప్రవర్తన మారిపోతూంటే లోలోపల ఎంత బాధపడుతున్నా, మొదటే

మంచి పరిస్థితులతో రాజీ పడటానికే అలవాటుపడిన నేను అన్యాయంగా ఆయన మాట్లాడుతున్నా అడుగుతున్నా హేళన చేస్తున్నా భరించేదాన్ని.

తన స్నేహితులలో ఎవరెవరికి ఎంతెంత కట్నాలువచ్చింది మావగారు ఎంత ఘనంగా లాంఛనాలు కానుకలు యిచ్చిందీ ఒకటికి నాలుగుసార్లు చెబుతూ వుండేవారు. కట్నానికి ఆశపడక కావాలని కోరి చేసుకున్న వారిలో ఆ బలహీనత చూసి బాధపడేదాన్ని జాలిగా నవ్వుకునేదాన్ని మరేమీ చేయలేని నిస్సహాయతతో.

పిల్లలు పుట్టారు. ఖర్చులు పెరిగాయి. ఆయనలో విపరీతమైన మార్పు వచ్చింది. కాలక్షేపానికి అంటూ మొదలు పెట్టిన పేకాట, సరదాకి అంటూ ప్రారంభించిన తాగుడు జీతాన్ని మింగేయటంతో నేను చాలా ఖంగారు పడేదాన్ని. అనునయంతో లాలింపుతో ఆయన్ని మార్చాలని ఎంతగానో ప్రయత్నించాను. పిల్లల్ని చూపించి వాళ్ళ భవిష్యత్తు కోసమైనా ఆ అలవాట్లని మార్చుకోమని బ్రతిమాలుకున్నాను. ఒకప్పుడు నిన్నెంతగానో ప్రేమించాను ఆరాధించాను అనే ఆయనకి యిప్పుడు నా మాటలమీద లక్ష్యమేలేదు. తమాషా ఏమిటంటే అయిదు నిముషాలు ఆయనతో మాట్లాడిన వారెవరూ ఆయనకి అలాంటి అలవాట్లున్నాయని డబ్బు తగలేస్తారని చెప్పినా నమ్మరు.

ఒక్కోసారి నాకనిపిస్తూ వుంటుంది. మా పెళ్ళినాడు మా అత్తగారు ఎంత బాధపడ్డారో! ఆవిడ ఉసురు తగిలిందేమోనని ఎన్నోసార్లు ఆయన్ని బ్రతిమాలాను. ఒక్కసారి వెళ్ళి వాళ్ళ వాళ్ళని చూసి రమ్మని. నా వాళ్ళమీద నీకంత ప్రేమ పుట్టుకుని వచ్చిందేమని వెటకారంచేసి పునాతిట్లూ తిట్టేవారు.

యిద్దరు ఆడపిల్లలు పుట్టగానే సంతానం కలుగకుండా ఆపరేషన్ చేయించు కుంటానన్నాను. పచ్చి బాలింతరాలిననే జ్ఞానంలయినా లేకుండా యిష్టం వచ్చినట్టు తిట్టి వెళ్ళిపోయారు. ఏడ్చి ఏడ్చి అలసిపోయాను. అయినా నా నిరయాన్ని మార్చుకోలేదు. ఆఫీసులో ఎని,



యింట్లో వంటపని పిల్లల పెంపకంతో సతమతమయి పోయేదాన్ని నేను. నాకు మగపిల్లవాడు పుట్టి వున్నామ వరకంనుండి రక్షించాలనే కోరిక లేదు. ఆయన అనుమతి లేకపోయినా నా పరిస్థితి డాక్టర్‌కి చెప్పి స్టెరిలైజేషన్ చేయించుకున్నాను తనకి తెలియకుండా.

నాన్న చావుబ్రతుకుల మధ్య వున్నారని కబురు వచ్చింది. వున్నది ఒక్క ఊరులోనే అయినా ఎప్పుడో కానీ అక్కడికి వెళ్లటానికి వీల్లేదు. చదువుకుని ఉద్యోగం చేస్తున్న ఆడదాని స్వాంతంత్రం అలాగే వుంటుంది కాబోలు అనుకునేదాన్ని.

కొన్ని నెలల క్రిందట వాళ్ల నాన్నగారు పోయారు. ఆయన పోయారని తెలియటమే కానీ అంతకుముందు పరిస్థితి తీవ్రంగా వుందని తెలియదు మాకు. తెలియనివ్వ వద్దని మావగారు శాసించారుట. ఆ పెల్లిగ్రాం చూసుకుని విల విల లాడిపోయారు. చంటి పిల్లాడిలా ఏడ్చారు. ఆ తండ్రి కొడుకులని వేరు చేసింది నే నేమోనని బాధపడ్డాను. వోదార్చి వెంటనే ప్రయాణం చేయించాను. నేనూ బయలుదేరబోతే వారించారు. కానీ తిరిగివచ్చాక పూర్తిగా మారిపోయారు. మావగారు పోవటానికి, చివరిచూపు తనకి అందక పోవటానికికూడా కారణం నేనే

# లలిత

నని సాధించేవారు. అన్నిబాధలని గుండెలలో దాచుకున్నాను. నాన్న ఆరోగ్యం అంత బావుండలేదని తెలిసి ఒకరోజు ఆఫీసుకి సెలవుపెట్టి వెళ్లి చూసివచ్చానని తెలిసి పెద్ద యుద్ధం చేసారు. ఆ తరువాత మళ్లీ వెళ్లి చూడలేదు.

కాని నాన్నకి అంత ప్రమాదంగా వుందని తెలిసికూడా నన్ను వెళ్లనివ్వలేదంటే ఆయన్ని ఏమనుకోవాలి? ఆరోజు ఆదివారం. ఎక్కడిపని అక్కడ వదిలివెళ్లబోతున్న నన్ను లోపల పెట్టి తాళంవేసి మరీబయటకి వెళ్లారు, తనకి తెలియకుండా నేను వెళ్లిపోతానని.

మా వీధిలో వాళ్లెవరో బజారులో కనపడి 'ఏమిటయ్యా యింకా యిక్కడే వున్నావు? మీ మామగారు కిందా మీదా వున్నారు' అన్నారుట. వెంటనే అటువెళ్లి అందరినీ పరామర్శించి వచ్చారుట. నేను మంచిసినిమా ఏదో వుందని వెళ్లానని చెప్పారట అందరితో. నిజమేననుకుని సినిమా హాలులన్నీ వెదికి వచ్చాడట మా చిన్న తమ్ముడు. యింటికివచ్చి నవ్వుకుంటూ చెబుతున్నారా సంగతి.

అందరూ దగ్గరున్నారు. ఊళ్లో వుండి నన్ను చూడలేక పోయాననే అసంతృప్తితో నాన్న కళ్లు మూసారట.

ఆ కబురువిని ఏడుస్తూంటే రిక్షా ఎక్కించి యింటికి తీసుకుని వెళ్లారు. అక్కడజరిగే ప్రతి తంతులో ఏర్పాట్లు చేయటం హడావుడి అంతా ఆయనదే.

'మీ నాన్న ప్రాణాలు పోతున్నాయని తెలిసి సినిమాకి వెళ్లావట కదా? మీ ఆయన పరుగులమీద వచ్చాడు. కన్న బిడ్డవి. నీకూ వున్నారు యిద్దరు కూతుళ్లు...' అంటూ శోకాలు పెడుతూనే నిలదీసి అడిగింది అత్తయ్య.

అందరిలో అపరాధిలా తల వంచుకోవలసి వచ్చింది. కన్నతండ్రి పోయినందుకే ఏడవాలో, ఈ నిందకే బాధపడాలో తోచలేదు. అందరితో తనెంతో బాగా వుంటారు. నా పెద్దతనాన్ని పది మందిలోపెట్టి తను మంచివాడిననని అనిపించుకోవటం సరదా. భార్యా విధేయుడనని పదిమందితో స్వయంగా చెప్పుకుంటారు.

ఒక కులం కాకపోయినా కట్నం కానుకలు యివ్వకపోయినా కావాలని పెళ్లి చేసుకున్నారు. ఆధునిక భావాలుకల యువకుడు, ఆదర్శవాది, కార్యవాది అని నలుగురిచేత బొసనిపించు కున్నారు. యిద్దరు సంపాదిస్తున్నా తన దురలవాట్లవలన ఒకోసారి ఎంతో కష్టంగా గడుస్తుంది. యిలాంటి పరిస్థితుల్లో నలుగురు పిల్లల్నికని ఎవరిమీద వాళ్ల బాధ్యతని మోపను? ఏ అనిప్పాసుల్లో చూసుకుని వాళ్లని పెంచను

నేను స్టెరిలైజేషన్ చేయించుకున్నానని తెలిసాక గొడ్డుని బాదినట్లు బాదారు. వారిచదువూ సంస్కారం చెప్పే ఖబురు తలుచుకొని జాలిపడ్డాను. యిప్పటికీ ఆ విషయం వచ్చినప్పుడల్లా నన్ను తిడతారు.

నా బిడ్డలమీద నాకు మమత వుంది కాని వెర్రిమొర్ర ఆశలు లేవు. తల్లిగా ప్రేమిస్తాను. వాళ్ల భవిష్యత్తు బాగుండాలనే కోరికతో నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. అంతే కాని పిల్లలు పెరిగి పెద్దవారయ్యి ఉద్ధరిస్తారనే కోరికలు పెంచుకోవటం అవివేకమే అవుతుంది ఈ కాలంలో.

మా మావగారినీ అత్తగారినీ ఆయన చూసారు కనుకనా మాకు పెద్దతనంలో చూడటానికి, మగపిల్లవాడు లేడని బాధ



హాయిని గొలిపే అందమైన

అతి సున్నితమైన పంచలు

మెత్తగా. మన్నాపదంగా వుంటాయి. సునాయాసంగా కట్టుకో వచ్చును. దావణగేరే కాటన్ మిల్స్‌చే తయారుచేయబడిన అతి సున్నితమైన ఈ పంచలు ధరించడానికి ఆనందకరంగా వుంటాయి. మీరు దావణగేరే కాటన్ మిల్స్‌చే తయారుచేయబడిన పంచలు కొనుక్కోండి. ఇంతేగాక, చొక్కాల కోసం 'రైల్ అనరబుల్' లేక 'రాస్‌షైన్' కేంబ్రిక్‌ను కొనుక్కోండి.

# ది దావణగేరే కాటన్ మిల్స్‌చే

నేయబడినవి



ది దావణగేరే కాటన్ మిల్స్ లిమిటెడ్, దావణగేరే.

ASP/DCM-2 TEL

# లలిత

పడటానికి ? వరుసగా ఆడపిల్లలే పుడుతూంటే మగబిడ్డ కావాలని కూర్చుంటే ఈలోపల పుట్టుకొచ్చే పిల్లలని చదివించటం పెళ్ళిళ్ళు చేయటం మాటేమిటి ? ఆయన ఆ మాత్రం ఎందుకు అర్థం చేసుకోరో నాకు తెలియదు.

పైసకి, పైస ముడివేసి ఆస్తులు పెంచి, తాము తృప్తిగా తినకుండా అనుభవించకుండా మూటలుకట్టి పిల్లకి బిచ్చం వేయకుండా పిల్లలకి ఆస్తులు కట్టబెట్టిన వెనుకటితరం వాళ్ళని మన తరంలో ఎందరు పెద్దలని గౌరవించి సుఖపెడుతున్నారు ?

మా యిద్దరి అభిప్రాయాలూ ఏ విషయంలోనూ కలవవు. ఒకోసారి సూటిగా ముఖంమీదే అంటారు. నిన్ను పెళ్ళిచేసుకుని చాలా పెద్ద పొరపాటు చేశానని. జీవితంలో మరి సరిదిద్దుకోలేని పొరపాటుని వివాహానికి పూర్వం ఆలోచించలేక పోయారట !

వేడిరక్తం కోరికలతో ఆశయాలతో ఉరకలు వేస్తూవుంటే ప్రేమ పేరిట వచ్చిన జీవిత భాగస్వామిని ధైర్యంగా ఎన్నుకున్నప్పుడు సహసంతో ఎదురయ్యే సమస్యలని ఎందుకు పరిష్కరించుకో లేరీ ప్రేమికులు, ఆదర్శవాదులు? కోరికలు తీరి కొత్తమోజు తీరాక కన్నవాళ్ళు తోడబుట్టిన వాళ్ళు గుర్తుకి వస్తారు. ఏ చిన్న సమస్య ఎదురయినా కోరి చేసుకున్న మాటే మరిచి అన్నిటికీ కారణం నువ్వేనని చెప్పుకుంటూ ద్వేషించుకుంటూ అశాంతిగా బ్రతకటానికి అలవాటు పడతారు.

ప్రేమ వివాహాలు పూర్తిగా విజయవంతం కాకపోవటానికి కారణం యిదే. పెద్దలు చేసిన వివాహాలలోనూ లోటుపాట్లు ఎన్నివున్నా అది ఖర్మ అనో ఎవరో అన్యాయం చేశారనో బాధపడతారు కానీ యిక్కడ స్వయంకృత అపరాధం అని తనని తాను నిందించుకుంటూ జీవితాంతం వరకూ మరి తోడూ నీడా లేకపోయినా అన్నీ తామే అయ్యి కష్టసుఖాలని పంచుకోవలసిన జీవిత భాగస్వామిని నిందించటం జరుగుతుంది...

ఎంతో అదృష్టవంతురాలు అనుకున్న విమలాదేవి జీవితంలో యిన్ని వ్యథలా ? ప్రేమించి వివాహం చేసుకున్న భర్త, వారి అనురాగానికి చిహ్నలుగా అందం ఆరోగ్యం వున్న పిల్లలిద్దరూ, అనుకూల దాంపత్యం అనుకుంది.

భగవాన్! బాధలూ సమస్యలూ లేని మనుషులే లేరా నీ సృష్టిలో ?

తెల్లబోయి వినటమే తప్ప మరేమీ మాట్లాడలేక పోయింది లలిత.

* * *

పశ్చాత్తాపం లాంటిదేదో సుధాకర్ని ఆలోచింప చేస్తోంది. ప్రతి మనిషిలోనూ మంచీ చెడూ వుంటాయి. ఆ రెండింటికీ ఘర్షణ తప్పదు. కొన్నిసార్లు మంచితనం గెలుపు పొందుతుంది. కొన్ని దురదృష్టపు ఘడియలలో మనిషిలో సహజంగా దాగివుండే అవివేకం, అహం విజృంభిస్తాయి.

ఎంతయినా లలితకి గర్వం వుండేది. తను సంపాదిస్తున్నానన్న ధీమాతోనే ఒకోసారి నిర్లక్ష్యంగా సమాధానాలిచ్చేది. నీ పిల్లల్ని నేను కాబట్టే యింత బాగా చూసుకుంటున్నాను అన్న గర్వం పైకి అనకపోయినా లోపల వుండేది — అంది అహం.

ఆమె సంపాదన తీసుకోవటానికి అభిమానం అడ్డురానప్పుడు నిజాన్ని సూటిగా చెబితే భరించటానికేం ? సవతి తల్లిలా చూడని లలితకి తను కృతజ్ఞుడై వుండాలి. కానీ తను అన్యాయంగా ప్రవర్తించాడు. ఆమె నిష్కల్మషమైన ప్రేమని పిల్లలమీద అభిమానాన్ని అనుమానించి గాయపరిచాడు. లలిత ఎన్నడూ నువ్వెంతంటే అన్నంత నిర్లక్ష్యంగా ప్రవర్తించలేదు. ఎప్పుడయినా విసుక్కుంటే తను సర్దుకుని పోవలసింది పోయి భావార్థంలో ఆమె ప్రవర్తననిమాపి విపరీత అర్థాలని ఊహించుకుని తను బాధపడి ఆమెని బాధపెట్టాడు. అయినా ఎన్నోసార్లు తను విసుక్కున్నా తిట్టినా లలిత సహనంగా భరించేది. మరి తనెందుకని సర్దుకుని పోలేకపోయాడు ?

విరజ చెప్పినట్టు లలితకి ఆత్మాభిమానం ఎక్కువ. అలాగే ఆత్మవిశ్వాసం

కూడా ఎక్కువే. దాన్ని తను అహంగా అర్థం చేసుకునేవాడు. ఆమెనుండి తాను రహస్యంగా దాచివుంచిన విషయం ఏ క్షణంలో లలితకి తెలిసిపోతోందో ఆమె ఎలా మారిపోతుందో అని లోలోపల తను భయపడేవాడు. అసలే ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ తనకి ఎక్కువ.

పార్వతి పోయినప్పుడు తన జీవితంలో ఎవ్వరూ తీర్చలేని ఒక పెద్ద అగాధం ఏర్పడిందని, తన బ్రతుకులో ఈ వెలితి ఎప్పటికీ యిలాగే వుండిపోతుందని బాధ పడ్డాడు.

గాడి తప్పిన జీవితాన్ని లలిత సరి చేయాలని ప్రయత్నించింది. తనకోసం తన బిడ్డలకోసం ఎంతగానో శ్రమపడింది. తిరిగి తన ఇంట్లో జ్యోతి వెలిగించిన లలితకి తనేం విలువయిచ్చాడు?

లలిత అంత ధైర్యంగా వెళ్లిపోతుం దనుకోలేదు. లలితకు విషయం తెలిసిం దన్న సంగతి తెలియక మూర్ఖంగా ప్రవ ర్తించాడు. ఆ ఒక్కరోజు పిల్లలని సము దాయించటానికి ఎంతెంతగానో అవస్థ పడ్డాడు.

పదిరోజులు కాలేదు. పిల్లల్ని పెంచ లేనంటూ అరుణ ఉత్తరం వ్రాసింది. అమ్మ కావాలి అని యిద్దరూ ఒకటే గోల. మీ అమ్మ చనిపోయిందని చెబితే మున్ని కొట్టబోయింది నన్ను. మా అమ్మ మా యింట్లో వుంది. ఎంతో మంచిది. నువ్వు పిచ్చిదానివి. నేను మా యింటికి వెళ్లిపోతానని ఒకటే గొడవ. ఆవిడగారికి పిల్లలూ సంసారమూ కంటే ఎవరో స్నేహితురాలి పెళ్లి ముఖ్యమా? యింకా ఎన్నిరోజులకి దిగుతుంది? రాగానే వచ్చి తీసుకునివెళ్లు యివెనకటిలా కాదు. ఈ సంవత్సరంలో పిల్లలు చాలా పెద్దవాళ్లు అయ్యారు. చెప్పినమాట అసలు వినరు. నేను వీళ్లని సముదాయిస్తూ యింట్లోపని చేసుకోలేను అంటూ మొహమాటం లేకుండా వ్రాసింది.

లలిత చెప్పినమాట వినే పిల్లలు అరుణని విసిగిస్తున్నారు. లలితలా సహనంగా అరుణ పెంచలేదు. అయినా ఎంతకాలమని అరుణ పెంచుతుంది? పెళ్లి సంబంధాలు చూస్తున్నాను ఒక సంబంధం కుదిరేలా వుంది. యిద్దరూ సంపాదిస్తున్నారు కదా నీకింక యిబ్బంది వుండదనుకుంటాను. వీలయినంతవరకూ డబ్బు సర్దాలి అంటూ తండ్రి వ్రాసిన ఉత్తరం.

తనేం చేయాలి? లలితని ఎక్కడని వెదకటం? ఏ అఘాయిత్యమూ చేసుకోకుండా వుంటేకదా— ఆ ఆలోచన అతన్ని వణికించింది. కానీ లలితకి తనమీద తనకి నమ్మకం ఎక్కువ? సూట్కేస్ పెట్టుకుని వెళ్లింది కదా అని ధైర్యం పచెప్పకున్నాడు.

నాలుగురోజుల క్రితమే లత వ్రాసింది. సెలవుపెట్టి యిద్దరినీ రమ్మని. బావగారికి సెలవు దొరకపోతే నువ్వు ఒక్కదానివైనా సరే తప్పకుండా రావలసిందనీ.

ఎక్కడికి వెళ్లింది లలిత?

ఆలోచనలతో తల బద్దలయిపోతూంటే సుధాకర్ బాధగా నుదురు నొక్కుకుంటూ సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ కూర్చుండిపోయాడు.

'సార్ అయ్యగారు పిలుస్తున్నారు.'

పరధ్యానంగా లేచి సిగరెట్టు యింకో దమ్ము పీల్చి చెప్పుకింద పడేసి నలిపి ఆఫీసర్ గదిలోకి వెళ్లాడు.

చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంటూ బయటికి వచ్చాడు. ఈ మధ్య పరధ్యాన్నంగా వుంటూ అశ్రద్ధగా పని చేస్తున్నందుకు మెత్తగానే అక్షింతలు వేశాడు ఆఫీసరు. అసలే చిరాకుగా వున్న సుధాకర్ మనస్సు మరీ అశాంతిగా బాధ పడింది. టీ తాగి సిగరెటు కాలుస్తూ తన సీటులోకి వచ్చి కూర్చున్నాడు.

ప్యూను ఉత్తరం ఒకటి తెచ్చి యిచ్చాడు. ఎంతో ఆశగా అందుకున్నాడు. లలిత దస్తూరి కాదు. తనకి పరిచయమైన వ్రాత కాదు. అది ఎవరు వ్రాశారో ఏమని వ్రాసారో అన్న ఆసక్తి కలగలేదు. లలిత ఉత్తరం కాదది — అన్న బాధే అతనిలో మిగిలిపోయింది.

'ఏమిటి గురూ! శ్రీమతి పుట్టింటికి వెళ్లిందేమిటి. పూర్తిగా వాలకం మారి పోయిందే?' ప్రక్కసీటు క్లర్కు నవ్వుతూ అడిగాడు.

పెరిగిన గడ్డం తడుముకుంటూ బలవంతంగా నవ్వాడు సుధాకర్. నీరజ మందలించటం గుర్తుకివచ్చింది. స్వయంకృత అపరాధం యిది. చేతులారా చేసుకుని యిప్పుడు క్రుంగిపోతే ప్రయోజనం ఏమిటి? విజయవాడ వెళ్లి లలిత ఆచూకీ తెలుసుకోవటానికి ప్రయత్నించు. లలిత స్నేహితురాళ్ల అడ్రసు కనుక్కో. రేపు లలిత నాన్నగారు మాకెందుకు తెలుపలేదు ఈ సంగతి, అని నిలదీసి అడిగితే ఏమని చెబుతావు? అంది.

నిజమే ఏమని చెబుతాడు?

ఆలోచిస్తూ కవరు చించాడు.

సుధాకర్ గారికి.

నమస్కారాలతో — నేను విమలని మీకు గుర్తు వుండే వుంటుంది.

సుధాకర్ కళ్లు గబగబా ముందుకి



పెళ్లయిన కొత్తలో
నిన్ను గాఢంగ ప్రేమించే
వాడిని - అందుకు
కారణం ఇప్పుడర్థ
మవుతోంది ప్రమీలా!



కదిలాయి. లావుగా పచ్చగా నవ్వుతూ పెళ్ళిలో మాట్లాడిన విమల మూర్తి అతని మనసులో కదిలింది. లలితకి ఆవిడంటే చాలా గౌరవం. యిద్దరికీ మంచి స్నేహం అని గుర్తుకి రాగానే అతని మనస్సు కొంత తేలికపడింది.

జీవితంలో ఓడిపోయానన్న వ్యథతో కుమిలిపోతూ ఎన్నటికీ తల్లిని కాలేనన్న వేదనతో క్రుంగిపోతూవుంది లలిత. ప్రతి స్త్రీకి మాతృత్వం ఒక వరం. లలితకి తగిలిన ఎదురుదెబ్బ సామాన్యమైనది కాదు. ఆమె పరిస్థితిని ప్రశాంతంగా ఆలోచించితే మీరు అర్థం చేసుకోగలరు.

నా ప్రియమైన స్నేహితురాలి జీవితంలో అతి ముఖ్యమైన మలుపు యిది. అందుకే ఆమెకి తెలియచేయకుండానే చొరవ తీసుకుని మీకు వ్రాస్తున్నాను.

లలిత తన భవిష్యత్తుని నిర్ణయించుకునే ముందు మీ యిద్దరూ మనస్సులు విప్పుకుని మాట్లాడుకోవటం యిద్దరికీ శ్రేయస్కరం అని నా అభిప్రాయం.

ఎక్కువ రోజులు మాయింట్లో వుండటానికి లలిత అభిమాన పడుతుంది. మీరు లలిత కావాలనుకుంటే ఈ ఉత్తరం అందగానే బయలుదేరి రండి. అడ్రసు క్రింద వ్రాస్తున్నాను.

—విమలాదేవి.

సుధాకర్‌కి అర్థం కాలేదు. లలితకి తెలియనివ్వకుండా విమల ఎందుకు వ్రాసింది? తెలిస్తే లలిత వ్రాయవద్దంటుందనా? తనిప్పుడు వెళ్ళాలా, లేదా? వెళ్ళితే లలితకి లోకువ అయిపోతాడేమో? వెళ్ళకపోతే లలిత తనకి దూరంగా వెళ్ళిపోతుంది.

కన్నవారింటికి వెళ్ళక విమల దగ్గరికి ఎందుకు వెళ్ళింది? 'లలిత నిర్ణయించుకోబోయే భవిష్యత్తు ఏమిటి? తనని కాదని వెళ్ళిపోతుందా?'

సగం రోజుకి సెలవుచీటీ వ్రాసి నీరజ దగ్గర కెళ్ళాడు. ఆప్యాయంగా ఆహ్వానించి ఆదుర్దాగా లలితగురించి అడిగింది నీరజ.

సుధాకర్ ఉత్తరం చదవమనియిస్తూ తన సందేహాలు సంశయిస్తూనే చెప్పాడు.

నీరజ కనులలో కోపం కదిలింది. 'నీలో ఆడది అనే చులకన పోలేదు సుధా. నిన్ను కాదంటే లలిత బ్రతకలేదు అన్న గర్వం యింకా నీలో పోలేదు. నువ్వు స్త్రీని సరిగ్గా అర్థం చేసుకోలేవు. తనని ప్రేమించేవారికోసం తను ప్రేమించి ఆరాధించే వారికోసం స్త్రీ ఎంతటి త్యాగాన్ని అయినా చేస్తుంది. ఆత్మార్పణ చేసుకుంటుంది. తనకి విలువ లేదని గ్రహించిన క్షణం ఆమె అభిమానం దెబ్బ తింటుంది.'

సుధాకర్ తల వంచుకున్నాడు. అవును తనలో మగవాడినన్న అహం వుంది. అందుకే లలిత తనకి దూరం అయ్యింది.

'యిప్పటికయినా నువ్వు వెళితే లలిత అన్నీ మరచిపోయి వస్తుందన్న నమ్మకం నాకుంది. యింకా ఆలోచిస్తూ కూర్చోకు సుధా. చేతులు కాలాక ఆకులు పట్టుకుని లాభంలేదు.' జాలిగా చూస్తూ అంది నీరజ.

*  *  *

'నలుగురిలో నా బ్రతుకు నవ్వులపాలు అవటానికే యిలా జరిగింది విమలా. నేను తలఎత్తుకుని ఎలా బ్రతకను?' రెండు చేతుల్లో ముఖం దించుకుంది లలిత.

విమలాదేవి ఏమనటానికీ తోచక అనునయంగా భుజం తట్టింది. కొందరి జీవితాలు ఎందుకింత చిత్రంగా మారిపోతూ వుంటాయో అనుకుంది బాధగా స్నేహితురాలిని చూసి.

వారం క్రితం లలిత తనకి ఉద్యోగం చూసిపెట్టమంది. విమలాదేవి పరిశీలనగా చూస్తూ 'అతని దగ్గరికి వెళ్ళదలుచుకోలేదా?' అని అడిగింది.

లలిత ముఖం తిప్పుకుంది.

'సుధాకర్ వ్యంగ్యంగా మాట్లాడి అపహాస్యం చేస్తేనే భరించలేకపోయావు. మొగుడ్ని వదిలేసిందని నలుగురూ నాలుగు రకాలుగా చెప్పుకుంటూ వుంటే, లోకం కాకులు పొడిచినట్టుగా నిన్ను మాటలతో పొడిస్తే భరించగల ధైర్యం నీకుందా?

'అతనికి విడాకులిచ్చి రెండో పెళ్ళి చేసుకుంటావా?'

'విమలా!' లలిత గొంతు వణికింది. 'మీరుకూడా యిలా మాట్లాడతారనుకోలేదు.

'నా అభిప్రాయం కాదు లలితా. నలుగురూ అనుకోబోయే వాటిగురించి చెబుతున్నాను. నువ్వు ఈ సమాజాన్ని ధైర్యంగా ఎదుర్కోగలవా అన్నదే నా భయం.'

లలిత కళ్ళల్లో ఎన్నో భావాలు కదిలాయి. అర్థం చేసుకున్నట్టు నవ్వింది విమల. 'నువ్వు తొందరపడకు లలితా. నేను నీకు సరాయిస్తాన్నా చెప్పు? యిక్కడ వుండటానికి నువ్వెందుకింతగా అభిమాన పడుతున్నావు? ఆపదలో ఆదుకోలేని స్నేహం దేనికి? ఆలోచిద్దాం. సమస్య వున్నప్పుడు పరిష్కారమూ ఏదో వుంటుంది.' అని అనునయించింది.

లలితకి వాంతులు తగ్గలేదు. నీరసంగా తిని తినక పాలిపోయింది. బలవంతంగా డాక్టర్ భారతి దగ్గరికి తీసుకుని వెళ్ళింది. ఆవిడ పరీక్షచేసి మూడవనెల గర్భిణి అని అంతకుపూర్వం తను పరీక్ష చేసుటంతో సరిగ్గా డయాగ్నెస్ చేయలేకపోయానని చెప్పి, మగవాళ్ళకి చేసే వేసెక్టమీలు అప్పుడప్పుడు కొన్ని ఫెయిలు అవుతున్నాయి. ఆపరేషన్ డాక్టరు అశ్రద్ధ కారణమని చెప్పింది.

ఈసంగతి తెలిస్తే సుధాకర్ ప్రవర్తన ఎలాగుంటుంది అన్నదే సమస్య.

లలితని అనుమానిస్తే — విమల మనస్సు పరిపరివిధాల పోతోంది. సుధాకర్‌కి తను ఉత్తరం వ్రాసానని చెబితే లలిత ఏదోలా చూసింది. అతనికి దూరంగా కొంతకాలమయినా వుండాలని అనుకుంటుంది లలిత. అతను వస్తే ధైర్యంగా తన మనస్సులో వున్నది అడిగేయాలని జరిగిందంతా నీ పొరపాటు వలనే అని అతను అహంభావంతో అంటే అతనికీ తనకీ సరిపడదని చెప్పేయాలని అనుకుంది. కాని లలిత ఆనందించవలసిందిపోయి ఆమె భయపడేలా సిగ్గుతో క్రుంగిపోయేలా చేసింది డాక్టరు చెప్పిన వార్త.

సుధాకర్ వేసెక్టమీ చేయించుకున్నాడని బంధువులలో చాలామందికి తెలిసే వుంటుంది. అందుకనే కాబోలు లలిత పెళ్ళికి బంధువులను ఎక్కువగా పిలవ

లేదు సుధాకర్. యిప్పుడు లలితకి బిడ్డ పుడితే బంధువర్గంలో చులకన అయి పోతానని సుధాకర్ అనుకుంటే ఆ పుట్ట బోయే బిడ్డ భవిష్యత్తు ఎలాగుంటుందో?

ఎంత ఆధునిక భావాలను వెలిబుచ్చినా స్వంత విషయాలలో ఆలోచనాసరళి మారి పోతుంది. అందులో ఆడదంటే అలుసు పోని ఆంధ్రభూమిలో ఆడదాన్ని అనుమా నించటం చాలా తేలిక.

విమలకి తనెప్పుడో విన్నసంగతి గుర్తుకి వచ్చింది.

ప్రభాకర్ అఫీసులో పనిచేసే ఒకతను అందరిపోరూ పడలేక ఎంతో భయపడుతూ భయపడుతూ భార్య, అత్త, మామ తోసి పంపించగా ఒక ప్రైవేటు డాక్టర్ దగ్గరికెళ్ళి వేసెక్టమీ చేయించుకున్నాడు. ఆ డాక్టర్‌కి చాలా పేరు ప్రతిష్ఠలు పలుకుబడి వున్నాయి. కాని ఏడాది తిరగకుండానే భార్యకి నెలతప్పింది. అతని అవస్థ వర్ణనాతీతం. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్న వారికి పిల్లలు పుట్టడం అతనెక్కడా వినలేదు. భార్యని అనుమానించినా పైకి చెప్పటానికి ధైర్యం చాలలేదు. లోలోపల క్రుంగిపోతోంటే అతన్ని హాస్యం చేసి ఏడిపించిన స్నేహితులే బలవంతాన ఆపరేషన్ చేసిన డాక్టర్ దగ్గరికి తీసు కెళ్ళారు. ఆ డాక్టరు అది తన పొరపాటు వలనే అలా జరిగిందని ఒప్పుకుని ఫీజు లేకుండా మళ్ళీ చేస్తానని చెప్పాడు. ఆ తరువాత తెలిసింది. ఆపరేషన్ చేసి నప్పుడు డాక్టర్ జోక్‌తో వున్నాడని.

డాక్టర్ అజాగ్రత్తవలన ఎప్పుడో ఎక్కడో జరిగిన పొరపాటును ఆధారంగా తీసుకుని కుటుంబ నియంత్రణ అంటే గిట్టని కొందరు రకరకాలుగా వ్యాఖ్యా నిస్తూ ప్రచారం చేస్తారు.

విజ్ఞాన యుగం ఇది. అన్ని విధాల పురోగమిస్తున్నప్పుడు ఎక్కడో జరిగిన పొర పాటులని ప్రచారంగా తీసుకోకూడదు.

ఆలోచనని మధ్యలో తెంపేసింది విమల. బయట ఎవరో ఆగిన చప్పుడు వినపడింది. అప్రయత్నంగా లలిత ముఖంలోకి చూసింది. అంతులేని దిగులూ విచారమూ నిండుకున్న కళ్ళు ఎత్తి భయంగా చూస్తోంది లలిత.

సుధాకర్ వచ్చిన కొద్దిసేపటికే ప్రభా కర్ వచ్చాడు. స్నానాలూ భోజనాలు అయ్యాక ప్రభాకర్‌ని ఏదో పనివున్నట్టు బయటకి పంపింది విమల. అంతవరకూ లలిత గది బయటకి రాలేదు. ఎన్నివిధాల బ్రతిమాలినా విమలమాట వినిపించుకో లేదు. ఆ పూట భోజనంకూడా చేయలేదు.

తనువచ్చి అంతసేపయినా లలిత కని పించలేదని సుధాకర్ చిన్నబుచ్చుకున్నా డని గ్రహించి నెమ్మదిగా సంభాషణ కదిలించింది విమల.

గుండెలు వేగంగా కొట్టుకుంటూ వుంటే క్రింద పెదవి నొక్కిపట్టి వాళ్ళ సంభాషణ వింటూ కూర్చుంది లలిత.

'భార్యా భర్తల మధ్య మూడోవ్యక్తి కలుగచేసుకోవటం బావుండదు. అయినా లలిత పరిస్థితి చూసి తప్పనిసరిగా నేను జోక్యం చేసుకోవలసి వస్తోంది...' మృదువుగా మొదలుపెట్టింది విమల.

'లలిత పరిస్థితి అంటే? సందేహంగా చూశాడు సుధాకర్. అడగదల్చుకున్న నాలుగు లలిత సూటిగా తనని అడగ వచ్చు కదా మధ్య ఈవిడ రాయబారం దేనికి? తను అసలు రామంద్గా వుండవల సింది. లోలోపల చిరాకుపడ్డాడు.

'మీరు మరోలా అనుకోకూడదు. లలి తని మీరు ఏ పరిస్థితులలోనయినా అను మానించ గలరా?'

సుధాకర్‌కి అర్థంకాలేదు. అయినా లలితని తను అనుమానించటం ఏమిటి?

'లలితకి యిప్పుడు మూడోనెల' చిరు నవ్వుతో చెప్పింది విమల.

'ఏమిటి మీరంటున్నది?' విపరీతమైన ఆశ్చర్యంతో ముందుకి వంగాడు సుధా కర్ అసలిదెలా సాధ్యం? తల్లిని కాలేనని నిజం తెలుసుకుని కదూ లలిత వచ్చింది?

లలిత ఎటువంటి పరిస్థితులలో ఎంతగా కుమిలిపోతూ తన దగ్గరకి వచ్చిందీ క్లుప్తంగా చెప్పి డాక్టర్ చెప్పిన మాటలు, ఎక్కడో నూటికి కోటికి ఆపరేషన్ ఫెయిల్యూర్ సంఘటనలూ ఉదా హరణగా వివరిస్తూ లలిత ఎంతగా సంకో చిస్తూ బాధపడుతున్నదీ మృదువుగా చెప్పింది.

'కొన్ని విషయాలలో నేను తెలివి తక్కు వగా ప్రవర్తించాను విమలాదేవి. లలిత మనస్సు చాలా సొమ్మసిలి వుంటుంది. అన్ని తెలిసిన మీదగ్గర నేను నా తెలివి తక్కువని ఒప్పుకోటానికి సంకోచించను కాని లలితని అనుమానించేంతటి మూర్ఖు డిని మాత్రం కాదు...' ఉద్వేగంతో లేచి నిలబడ్డాడు సుధాకర్.

ఎంతో భారం తగ్గినట్టు తేలికగా నిట్టూర్చింది విమలాదేవి. 'నాకు చాలా సంతోషంగా వుందండీ. లలిత ఆ గదిలో వుంది' చిరునవ్వుతో ఎదుర గదివైపు చూస్తూ అంది.

'ముందుగా మీకు కృతజ్ఞతలు చెప్ప కోవాలి' ఉత్సాహంతో వెలుగురేఖలు నింపు కున్న అతనికళ్ళు విచిత్రంగా మెరిసాయి.

గది బయట వినిపిస్తున్న అడుగుల సవ్వడి విని నవ వధువులా సిగ్గుపడుతూ కనురెప్పలు వాల్చుకుంది లలిత.

(అయిపోయింది)





# ఆంధ్రసచిత్రవార పత్రిక సింథాల్ పోటీ




ప్రతి సంవత్సరం ఆంధ్ర సచిత్ర వారపత్రిక సినిమా బాలెట్ నిర్వహిస్తున్న విషయం పాఠకులకు తెలిసినదే. ఈ సంవత్సరం సినిమా బాలెట్ నిర్వహణలో 'సింథాల్' టాయిలెట్ సబ్బు తయారు చేసే గోద్రెజ్ సోప్స్ ప్రయివేట్ లిమిటెడ్ వారు కూడా పాల్గొంటున్నారు అంతేకాక బాలెట్ నిర్వహణ మరింత ఆకర్షణీయంగా ఉండటానికని ఒక పోటీని కూడా నెలకొల్పడం జరుగుతోంది. పోటీలో నెగ్గినవారికి ఎన్నో బహుమతులు యివ్వబడుతాయి. వాటి వివరాలను ఈ పేజీలలో చూడవచ్చు. ఈ పోటీలో పాఠకులందరూ ఉత్సాహంతో పాల్గొని జయప్రదంచెయ్యగలరని ఆశిస్తున్నాము.

## మొదటి బహుమతి రు 2000

## రెండవ బహుమతి రు 750

## మూడవ బహుమతి రు 500

## ఇంకా ఆకర్షణీయమైన 25 కన్సొలేషన్ బహుమతులు

## పోటీ నిబంధనలు

● ఈ పోటీలో పాల్గొనడానికి ప్రవేశరుసుము లేదు. ఒకరు ఎన్ని ఎంట్రీలనైనా పంపవచ్చును, కాని ఒక పోటీదారునికి ఒక బహుమతికి మాత్రమే అర్హత ఉంటుంది. ● ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచికలలో ప్రచురించిన బాలెట్ పత్రాన్నే ఉపయోగించాలి. ● పూర్తిచేసిన ప్రతి బాలెట్ పత్రంతో ఒక సింథాల్ సబ్బు (పెద్దది లేక మీడియం) రేపర్ని జతపరచి పంపాలి ● పోటీకి గడువు తేది 28-2-1970. ● గోద్రెజ్ సోప్స్ ప్రయివేట్ లిమిటెడ్, వారి వ్యాపార ప్రకటన సంస్థలు, ఆంధ్రసచిత్రవారపత్రికలలోని ఉద్యోగులు ఈ పోటీలో పాల్గొనడానికి అర్హులు కారు ● న్యాయ నిర్ణేతల సంఘం ఒకటి

(మిగతా ఎదురు పేజీలో)

ఈ 25 కన్సొలేషన్ బహుమతులు పొందిన వారిలో పదిమందికి ఆంధ్రసచిత్రవారపత్రిక మూడు నెలలపాటు ఉచితంగా పంపబడుతుంది. మిగతా పదిహేను మందికి గోద్రెజ్ సబ్బులు, అలంకరణ సామగ్రి గల ఆకర్షణీయమైన బహుమతి పొట్లాలు అంద చేయబడుతాయి.

ఫలితాలని నిర్ణయిస్తుంది. పోటీలో పాల్గొనేవారందరూ ఆ నిర్ణయానికి బద్ధులై ఉండాలి ● ఈ సందర్భంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు. ● *1969* లో విడుదలైన తెలుగు చిత్రాలననుసరించి పోటీదారులు బాలట్ పత్రాలని సిరాతో రాసి నింపాలి (చిత్రాల జాబితాని **16-1-70** సంచికలో వేశాము). ● పోటీ ఫలితాలు 'ఆంధ్రసచిత్రవారపత్రిక ఉగాది ప్రత్యేకసంచిక'లో ప్రకటింపబడతాయి. ● బాలట్ పత్రాలను 'ఆంధ్రసచిత్రవారపత్రిక-సింథాల్ పోటీ', కేరాఫ్ ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1కి పంపాలి. కవరు మీద "ఆంధ్రసచిత్రవారపత్రిక - సింథాల్ పోటీ" అని స్పష్టంగా రాయాలి.

<u>గమనిక</u> : ఈ పోటీకి మావద్ద సరైన సమాధానం అనేది ఏదీ లేదు. పోటీదారులు బాలట్ పత్రాలలో యిచ్చిన ప్రాముఖ్యతనుబట్టి సరైన సమాధానాన్ని తయారుచేయడం జరుగుతుంది.

## బాలట్ పత్రం

| ఉత్తమ చిత్రం | ఉత్తమ దర్శకుడు | ఉత్తమ నటుడు | ఉత్తమ నటి |
| --- | --- | --- | --- |
| వరకట్నం | V. మధుసూదనరావు | N.T. Rama Rao | Sarada |

| ఉత్తమ సహాయనటుడు | ఉత్తమ సహాయనటి | ఉత్తమ హాస్యనటుడు | ఉత్తమ సంగీతదర్శకుడు |
| --- | --- | --- | --- |
| Krishna | విజయనిర్మల | రాజబాబు | T.V. Raju |

ఆంధ్రసచిత్రవారపత్రిక అంటే నాకు ఎందుకు యిష్టం (6 మాటలకు మించకుండా)------------

--------------------------------------------

సింథాల్ సబ్బు అంటే నాకు ఎందుకు యిష్టం (6 మాటలకు మించకుండా)------------

--------------------------------------------

మీ నిబంధనలన్నింటికీ నేను బద్ధుడను/బద్ధురాలను. పోటీదారుని సంతకం------------

పోటీదారుని పూర్తి పేరు--------------------------

పూర్తి చిరునామా--------------------------

# ఆరాధన

▣ రహస్య వివాహం చేసుకున్న ఒక అమ్మాయి తన భర్త ఆశయాన్ని, కడసారి కోరికని, నిర్వర్తించడానికి సమాజంలో ఎదుర్కొన్న సమస్యలని శక్తి ఫిలింస్ ఈస్ట్మన్ కలర్ చిత్రం 'ఆరాధన'లో చక్కగా చిత్రీకరించారు.

భర్త కడసారి కోరిక ననుసరించి కొడుకుని భారత విమాన బలంలో అతి సాహసవంతుడైన వైమానికుడుగా తీర్చి దిద్దడానికి జీవితాన్ని అంకితం చేసిన అతివగా షర్మిలాఠాకూర్, తండ్రిగా ఆ తర్వాత తనయుడిగా రాజేష్ ఖన్నాల నటన ఉన్నత శిఖరాల్ని అందుకుంది.

ఇంకా ఈ చిత్రంలో సుజిత్ కుమార్, పహారీసన్యాల్, అనితాదత్, అభిభట్టాచార్య, మాస్టర్ షహీద్, సాధనాపటేల్, ఉమాదత్, బేబి షబ్నమ్ మొదలగువారు నటించారు.

'మేరే సప్నోంకి రానీ...', 'గునగునా రహేహై...', 'చందాహైతూ మేరే సూరజ్ హైతూ...' అన్న పాటలు ప్రజాదరణ పొందుతాయి. సంగీతాన్ని ఎస్. డి. బర్మన్ కూర్చిన ఈ చిత్రానికి నిర్మాత, దర్శకుడు శక్తిసమంత్. మదరాసులోని లిటిల్ ఆనంద్‌లో యిప్పుడీచిత్రం ఆడుతూంది.

— ఆర్. ఎం.

# సినిమా

▣ శ్రీమతి యలమంచిలి ఝాన్సీలక్ష్మి వ్రాసిన 'వెలుగునీడలు' సీరియల్ నవలను ఆంధ్రసచిత్రవారపత్రికలో పాఠకులు చదివే వుంటారు. ఆ నవలను ఒక ప్రముఖ నిర్మాత వెండితెర కెక్కించే యేర్పాట్లను చేస్తున్నట్లు తెలుస్తూంది. ప్రస్తుతం ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురితమౌతున్న 'మనుషులూ—మమతలూ' సీరియల్ నవల చిత్రంగా తీయడానికి శ్రీ హేమాంబరధరరావు సంకల్పించారని తెలుస్తూంది.

* * *

పద్మశ్రీపిక్చర్స్ నిర్మించనున్న సాంఘికానికి కూడా భమిడిపాటి కథకుడు. వాణిశ్రీ, నాగేశ్వరరావు ప్రధాన పాత్రధారులు.

జానపద నాయకుడిగా ముద్ర వేసుకున్న శ్రీ కాంతారావు ఒక సాంఘిక చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు. సుబ్బరామదాసు డైరెక్టు చేయనున్న యీ చిత్రంలోని ప్రధానపాత్రలను శోభన్, రాజనాల మరియు కాంతారావు ధరించగలరట. షూటింగు ఫిబ్రవరిలో ప్రారంభమౌతుంది.





బి. సరోజాదేవి

ప్రసాద్ [illegible] రామాలయం వెలసిందని [illegible] చూద్దామని వెళ్లాను. నేను వెళ్లినప్పుడు (రామాచారి) నాగభూషణంగారిని పూలమాలలతో ముంచేస్తూ ఆయన గుణగణాలను ప్రస్తుతించడం నా చెవిని బడింది. ప్రశంసలతోనే గాక ఆయన గౌరవార్థం (రంగనాయకి) గీతాంజలి నాట్యప్రదర్శనాన్ని కూడా ఆ వూరి ప్రజలు యేర్పాటు చేసారు. ఆమె అందచందాలను, నాట్యకళాకౌశలాన్ని చూచి ముగ్ధుడ్నయ్యాను. ప్రేక్షకులంతా నాట్యం తిలకిస్తూ పరవశమౌతున్న తరుణంలో గర్భగుడిలోని దీపం హఠాత్తుగా ఆరిపోయింది. ఆరిపోయిన దీపాన్ని జనంలో కూర్చుని వుండిన వాణిశ్రీ (మొల్ల) వెలిగించింది. నాగభూషణం ముఖం వివర్ణమైంది. ఆగ్రహావేశాలతో వాణిశ్రీని అనరాని మాటలు అనేసారు. 'నీకు ఎవరిచ్చారీ హక్కు? గుడిలోని దీపాన్ని వెలిగించే ధైర్యం నీకెక్కడిది?' అంటూ వాణిశ్రీపై విరుచుకుపడ్డారు నాగభూషణం. అక్కడ గుమికూడిన

## సినిమా డైరీ

● టైగర్ ప్రొడక్షన్స్ "అఖండుడు" షూటింగు జనవరి 3 నుండి 9 వరకు వాహినిలోని వివిధ ఫ్లోర్లలో జరిగింది. కృష్ణ, భారతి, ముక్కామల, ప్రభాకరరెడ్డి, రాజబాబు రమాప్రభ, గీతాంజలి పాల్గొన్నారు. ఈ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు.

● అనూరాధా ఆర్ట్ పిక్చర్స్ వారి "అనూరాధ" షూటింగు వాహినీలోని 7వ ఫ్లోర్‌లో జనవరి 2 నుండి 12 వరకు జరిగింది. పి. పి. రెడ్డి దర్శకత్వంలో కృష్ణ, విజయనిర్మల, ఎస్వీరంగారావులు పాల్గొన్నారు.

● రవిచిత్ర యొక్క రెండవ క్రయిం థ్రిల్లర్ షూటింగు గోల్డెన్ స్టుడియోలో జనవరి 2 నుండి 12 వరకు జరిగింది. కుటుంబరావు నిర్దేశకత్వంలో కృష్ణ, విజయనిర్మల, విజయలలిత, సత్యనారాయణ త్యాగరాజు పాల్గొన్నారు.

● సినస్ అశోక్ పిక్చర్స్ షూటింగు వి. మధుసూదనరావు దర్శకత్వంలో జనవరి 2 నుండి 12 వరకు విజయాలో జరిగింది. అక్కినేని, వాణిశ్రీ, జి. వరలక్ష్మి పాల్గొన్నారు.

# తొంగిచూసే యవ్వనం మిడిసిపడే రంగులు



మేలురకం టెరీన్/కాటన్ దుస్తుల్లో ఎంతో అందంగా కనిపిస్తారు మీరు. హాంతంగా, నలక్కుండా వుండే యీ దుస్తులలో మెత్తని, సుతిమెత్తనిదనాన్ని అనుభవించండి. వన్నెల చిన్నెలతో, మిడిసిపడే రంగులతో...పాప్లిన్‌తో రంగుకి సరిపడే చూడీదార్ పైజమాతోనో, లేకపోతే రెండూ పై రెండు కమీజుతోనో వాడండి. ముచ్చటైన అరవై రంగుల్లో! కావలసిన గళ్ళు, చారలు, మిశ్రాలు, ప్రింట్లు, సాదా రంగులు, యింకా యింకా...

**TATA** *Textiles* టాటా టెక్స్‌టైల్స్ వారి ప్రింట్లు



'చిట్టి చెల్లెలు'లో వాణిశ్రీ, రామారావు, హరనాథ్.

జనం అంతా 'దీనికి ధైర్యం వాళ్ళ బాబుదగ్గర్నుండి వచ్చిందండి. వీళ్ళ తండ్రి (గుమ్మడి) మహాపండితుడిలా యేదో వుద్గ్రంధాన్ని వ్రాస్తున్నాడట, ముందు అతనిపని బట్టాలి' అని వాగసాగారు. నాగభూషణం వుగ్రుడయ్యాడు. చరచర నడచివెళ్ళి గుమ్మడి (కేశన్న) రాస్తున్న గ్రంధాన్ని లాగి చించపోయారు. 'కట్' అన్నారు దర్శకుడు పద్మనాభం. ఈ సన్నివేశం 'కథానాయిక మొల్ల' చిత్రంలో కనిపిస్తుంది. గుడిలోని దీపాన్ని వాణిశ్రీ వెలిగించింది తప్పా? అది ఒప్పు అయితే నాగభూషణం

## సినిమా

కోపానికి కారణం ఏమై వుంటుంది? ఈ ప్రశ్నలకు సమాధానం ఇంటూరి కలం అందించిన 'మొల్ల' చెప్తుంది. ఈ చిత్రానికి బి. ఎల్. ఎస్. ఆచార్య మాటలను సమకూర్చారు. సంగీతాన్ని కోదండపాణి, ఛాయను సత్యనారాయణ నిర్వహిస్తున్న ఈహా చిత్రం లక్ష్మి పిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది.

* * *

ప్రసాద్ నుండి శారదాకు వెళ్ళాను. రెండవ ఫ్లోర్‌లోకి అడుగుపెట్టాను. నూతన వధువుగా సర్వాలంకార శోభితయైన ఒక యువతి బుగ్గన సిగ్గు తొడిగి తన చెలికత్తెల సరసన చిలిపి చూపులను విసురుతూ ముచ్చటలాడుతూంటే, ఆమె చెలికత్తెలు వూరుకుంటారా? వాళ్ళు ఆమె మనస్సును పసిగట్టారు. ఆమె మనోభావాన్ని బయటపెట్టారు. ఆ భావాన్ని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కలం ఎలా అందించిందో తెలుసా?

'చిరునవ్వు దివ్వె ఏమన్నదే
అరమోడ్పు కన్ను ఏమన్నదే
తనకన్న ముందే పగడున్నచోటికి
మనసుపోయెనంటున్నదే'

అంటూ ఆమెను యేడిపించసాగారు. 'కట్' అన్నారు దర్శకుడు నందనరావు. ఈ శృంగార సన్నివేశం 'జగజ్జెట్టీలు' చిత్రంలో కనపడుతుంది.

లైటింగు మార్చుకోవలసి రావడంతో దర్శకుడు నందనరావుకు కాస్త గ్యాప్ దొరికింది. నేను ఆయన్ని సమీపించి 'ఆమెను నేను ఏ చిత్రంలోనూ చూడలేదండీ. కొత్తమ్మాయా? చాలా అందంగా వుందే?' అని అడిగాను. అవునండీ. ఆమె నటిస్తున్న మొదటి చిత్రం యిదే. పేరు స్నేహప్రభ. ఈ చిత్రంలో ఎస్వీ రంగారావుకు చెల్లెలిగా నటిస్తోంది. ఈమె భర్తగా చంద్రమోహన్ నటిస్తున్నారు. ఎక్స్‌ప్రెషన్ కూడా ఫర్వాలేదు. 'త్వరలోనే తారాపథాన్ని అందుకోగలదనే నమ్మకం నాకుంది' అన్నారు. నందనరావుగారి మాట ఫలించి తీరుతుంది అన్నారు నిర్మాతలు ఏకామ్రేశ్వరరావు, రాఘవగార్లు.

ఫల్గుణా పిక్చర్స్ నిర్మిస్తున్న రెండవ క్రయిం థ్రిల్లర్ 'జగజ్జెట్టీలు' ఈ చిత్రంలో వాణిశ్రీ, శోభన్‌లు నాయికానాయకులు. ముఖ్యపాత్రలను ఎస్వీరంగారావు, గుమ్మడి, రాజబాబు, వేణులు ధరిస్తున్నారు. లక్ష్మి పిక్చర్స్ పంపిణీదారులు.

* * *

శారదానుండి యింటికి వస్తూ, మాధవనాయక్ కాలనీలో గల రాజబాబు యింటికి వెళ్ళాను. అప్పుడు సాయంకాలం అయిదు గంటలనుకుంటా. వరండాలో రాజబాబు



'జగత్ జెట్టీలు'లో రంగారావు, వాణిశ్రీ.

ఏకాంతంగా కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. నా కళ్ళు టెలిఫోను వైపుకు వెళ్ళాయి. రాజబాబు కుమారుడు (రెండేండ్ల అబ్బాయి) ఫోను దగ్గర కూర్చుని, డయల్ చేస్తున్నాడు. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. అంతే కాదు నన్ను చూడగానే నమస్కారం పెట్టాడు. ఆ పాపాయి సంస్కారానికి అచ్చెరువొందాను. టైం చూశాను. అయిదున్నర అయింది. అప్పటికిగాని నా రాక సంగతి రాజబాబుకు తెలిసి వచ్చింది కాదు. 'ఏం బాబూ, ప్రపంచం తల్లక్రిందులయినా మీరు తేరుకునేట్టు లేదే?' అన్నాను. 'మరేం లేదు. పిక్చరు తీస్తున్నాను కదా. దాన్ని గురించి ఆలోచిస్తున్నాను. నా చిత్రానికి 'ఎవరికి వారే యమునాతీరే' అని పేరు పెట్టాను. ఎలా వుంది?' అని ప్రశ్నించాడు. అద్భుతంగా వుందన్నాను. ఆ తర్వాత తన కథలోని కొంత భాగాన్ని వివరించారు. 'నేను పిక్చరుకు వెళ్తున్నాను, వస్తారా అని అడిగారు.' 'లేదండీ. నేను కీల్పాకం వెళ్ళాలి' అన్నాను. 'ఏమిటీ బుర్రకు రిపేరా' అన్నారు. 'అబ్బే కాదండీ న్యూటోన్ స్టుడియోకు వెళ్ళాలి' అంటూ వచ్చేశాను.

బాబ్ అండ్ బాబ్ ప్రొడక్షన్స్ నిర్మించనున్న సాంఘిక చిత్రమే 'ఎవరికి వారే యమునాతీరే', జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకత్వంలో మే మాసంలో సెట్సుకు వెళ్ళనున్న. ఈ చిత్రంలో ఎస్వీ రంగారావు నాయకుడు. కథ రాజబాబుది. మాటలను భమిడిపాటి, ఆదుర్తి నరసింహమూర్తి రాస్తున్నారు.

* * *

రాత్రి ఏడుగంటలకు న్యూటోన్‌కు వెళ్ళాను. ఆరోజు 'ఖడ్గవీర' షూటింగు జరుగుతున్నట్టు తెలిసింది. ఫ్లోర్‌లోకి వెళ్ళాను. అది నాకు ఫ్లోరులా అనిపించలేదు. ఎలా అనిపించిందో తెలుసా? స్వర్గలోకం అనిపించింది. అంతే కాదు అక్కడ రంభలాంటి అందాలరాణి కూడా వెలసింది. ఆమె మూర్తీభవించిన సౌందర్య కాంతయా అనిపించే విధంగా భగవంతుడు ఆమెకు అవయవ సౌష్ఠవాన్ని వరంగా ఇచ్చాడు. అందాల బరిణె



'జై జవాన్'లో నాగేశ్వరరావు, చంద్రకళ.

మాత్రమే కాదు. ఆటపాటల్లో ఆరితేరిన జాణ ఆమె. ఆమె మీకు పరిచితురాలే. ఆమె ఎవరను కుంటున్నారు? ఆమె జ్యోతి లక్ష్మియే.

అంద చందాలతో అలరారే ఆమెకు మగసిరిగల మగవాడు కావాలిగా. అందుకే కాంతారావును ఎన్నుకుంది. అతన్ని తన క్రీగంటి చూపులతో, శృంగార చేష్టలతో ఆకట్టుకోవాలనుకుంది. కాంతారావును ఆకర్షించడానికి గజ్జె కట్టింది. పాటపాడింది.

'నా కౌగిలి ఏ గిలిగిలి
పొంకమైనది బింకమైనది!
పొందుగోరి నీవ్వంత మైనది-
పొంగే పరువం లొంగివి అందలో
మోజుపడిన రాజా
మధువులోన నా మనసు కలిపితి
నీకై నీకై
మనసులోని మమత తెలిపితి
నీతో నీతో'

అంటూ కాంతారావును గాఢంగా కౌగిలించుకుంది. 'కట్' అన్నారు దర్శకుడు జి. విశ్వనాథం. జ్యోతిలక్ష్మి ప్రేమను కాంతారావు అంగీకరించాడా? లేదా?



'మా నాన్న నిర్దోషి'లో ఒక దృశ్యం

# సినిమా

తెలుసుకోవాలంటే విజయరాణి కంబైన్స్ నిర్మిస్తున్న 'ఖడ్గవీర' చూడాల్సిందే.

శ్రీ చంద్రుడు సూర్యనారాయణ సమర్పిస్తున్న ఈ చిత్రానికి టి. వి. రాజు సంగీతాన్ని, మధు ఛాయను, ప్రొడక్షన్సు కె. ఎం. నాయుడు నిర్వహిస్తున్నారు. జె. ఎం. కృష్ణంరాజు, శోభనాచలంగారు నిర్మిస్తున్న ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను కాంతారావు, రాజశ్రీ, రాజనాల, త్యాగరాజు, ముక్కామల, బాలకృష్ణ, జ్యోతిలక్ష్మి, అర్జా జనార్దనరావు, మీనాకుమారి, సబిత పోషిస్తున్నారు. ఈ చిత్రాన్ని జయలక్ష్మి పిక్చర్స్ ఏప్రిల్‌లో విడుదల చేస్తారు.

* * *

నా రెండవనాటి సంచారం విజయ స్టూడియోతో ప్రారంభమైంది. ఫ్లోర్ బయట హీరో నాగేశ్వరరావు, జి. వరలక్ష్మి, దర్శకుడు మధుసూదనరావు



'ఖడ్గవీర'లో మీనాకుమారి.

## మీకు తెలుసా?

నటుడు శివాజీ హైదరాబాదుకు వెళ్ళినప్పుడల్లా నాగేశ్వరరావును చూడకుండా రారు. అలాగే నటుడు అశోక్‌కుమార్ మద్రాసుకు వస్తే బాలాజీని పలకరించకుండా వెళ్ళరు.

నటి సరోజాదేవి ఆంజనేయస్వామి భక్తురాలు. శనివారం ఆంజనేయస్వామికి విశేషమయిన పూజలు చేస్తారట.

ఆంగ్ల చిత్రాల్లో టార్జాన్‌గా నటించి పేరు గడించిన ఒకే నటుడు జానీవీస్ ముల్లర్.

కూర్చుని వున్నారు. 'నమస్కారమండి, నాగేశ్వరరావుగారూ' అంటూ వెళ్ళి కూర్చున్నాను. 'మరో ప్రపంచం షూటింగు పూర్తయిందా, ఎప్పుడు విడుదల చేస్తారు?' అని ప్రశ్నించాను. 'జనవరి 2తో షూటింగు పూర్తయింది. ఈ నెలాఖరున విడుదల కావచ్చు' అన్నారు. ఇంతలో 'లైటింగు రెడీ, షాటుకు రండి' అని పిలవడంతో శ్రీ అక్కినేని సెట్లోకి వెళ్ళారు. మళ్ళీ కలుస్తాను అని చెప్పి నేను వచ్చేసాను.

—శ్రీనివాస్

## వివాహం

శ్రీమతి జి. వరలక్ష్మమ్మ (ఆంధ్ర పత్రిక ఏజంటు, కావలి), శ్రీ జి. వి. సుబ్బయ్యగార్ల ప్రథమ పుత్రిక చి. సౌ. వరలక్ష్మికి చి. వెంకట రాజేంద్రప్రసాద్ (విజయా లేబొరేటరీ)కి డిశెంబరు 25వ తేదీన కావలిలోని కన్యాదాత స్వగృహంలో వైభవంగా వివాహం జరిగింది. వివాహానికి పలువురు ప్రముఖులు విచ్చేసి వధూవరులని ఆశీర్వదించారు.

# పుస్తకాలు

## విద్యార్థి సాహితి

[వివిధ విద్యార్థుల కథలు. పేజీలు 87. ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్. రాష్ట్రపతి రోడ్డు. సికింద్రాబాదు. వెల రూ. 2—00.]

భవిష్యత్ పౌరుల ఈ ప్రయత్నం ప్రచురించిన వాళ్ళూ పరికించేవాళ్లు మంచిపని చేస్తున్న వాళ్ళు.

కొందరకు ఆదర్శవివాహాలు తద్విపరీతాలు కథా వస్తువులు. కొందరకు బీదతనం, కొందరకు అనాహ్వా వేదన స్త్రీ విపరీత ప్రవర్తన వస్తువులు.

రచన ఎలా సాగినా వ్రాయాలనే తపన గొప్పది. అది అక్షర రూపం పొందటం ఆనందింపవలసిందే!

ఇద్దరు ముగ్గురు తప్ప భవిష్యత్తులో మంచి కథలు వ్రాయగలవాళ్ళు కథా రచయితలుగా ఉన్నారు. ఇద్దరు రచయిత్రులు.

రేడియో నాటిక 'యువతి' ప్రభావంతో వ్రాసిన కథ 'నైట్ డ్యూటీ నర్స్.' 'కనువిప్పు' వయస్సుకు మించిన కథ మధురోహ. 'ఫౌల్ ఫౌల్' మంచికథ, ఎక్కువ సాగింది. ఇంకా సంక్షిప్తంగా ఉండాలి. 'దొంగను కానుబాబూ', 'ఊహించని పరిణామం' ముగింపు బాగున్న కథలు. సర్సర్ మీద అభిమానం, పల్లెంటే గౌరవం, గేదె తిన్న దెబ్బల్లో దిగులు, అర్థంగాని గీత బాధ— పసివాళ్ళ ముచ్చటయిన పనుల్లా చదవ దగిన కథలు.

## వినడానికో కథ

[శ్రీ పింగళి రంగారావు కథలు. ప్రతులకు: సృజన, వరంగల్—2. వెల: 175 పైసలు.]

'నిరాహారదీక్ష చేయబడును' సెటైర్. దీక్షితులు భార్యతో తగాదాపడి నిరాహారదీక్ష పూనితే ఒక్క రోజుకే కడుపు మండింది. 'పోస్ట్ మార్టమ్'లో కృష్ణప్రియ ఆత్మహత్యను గూర్చి తల్లి తప్ప తతిమ్మా ఎవరూ సానుభూతి చూపలేకపోవటానికి కారణం ఏమిటి? చేతివ్రేళ్ళు పోయినవాళ్ళు ఉన్న వాళ్ళను చూచే పొందే బాధ చిత్రపురించే! వినడానికో కథ యువకుల అవ్యవస్థకో నిదర్శనం, అపకటవకలకో నిరూపణం బ్రతె + భార్య = దుఃఖం లేనోడు' i.e. రెండూపోయిన వాళ్ళు. 'సావిత్రి' అంతగా పనిచేయటం అన్యాయం. అది గుర్తించక పోవటం దురన్యాయం. 'అదిగో బస్సు' ఇదిగో బస్సు. వస్తుంది, పోతుంది. గొర్రెతోక బెత్తెడు. అందదూ, పొందదు. అంతే జీవితం.

ఈ యువరచయిత భవిష్యత్తులో తప్పకుండా మంచికథలు వ్రాయవచ్చు.

కథారచయితకు అవసరమయిన అన్ని లక్షణాలు బీజప్రాయంగా ఈ రచయితకున్నాయి.

ఈ కథలు వినవచ్చు.

## స్పందన

[కవితా సంకలనం. ప్రతులకు: స్పందన సాహితి. 1—8—172 చిక్కడపల్లి, హైదరాబాదు—20. వెల: రూపాయి.]

వచన గేయం బలమైన ఆయుధం.

అది అసమర్థుల చేతుల్లో సమర్థంగా పని చేయదు.

ఈ సంపుటిలో అధిక సంఖ్యాకులు గేయ రచనకు ప్రయత్నిస్తున్నవాళ్ళు. ఇవి అభ్యాసప్రాయ రచనలు. రచయిత్రులూ ఉన్నారు.

కొందరు ప్రసిద్ధుల పనికిరాని గేయాలు అప్రసిద్ధుల పనికి వచ్చే గేయాలూ ఉన్నాయి.

స్పందన ఉద్దేశం మంచిదే! ధర కూడా తక్కువే. అయితే మరింత మంచి రచనలు మలి సంపుటిలో వస్తాయని ఆశింపవచ్చు.

'సంధ్యానందనం' వచన గేయ వ్యవస్థ వెక్కిరిస్తున్నట్లుగా వుంది.

ఈ వచన గేయ కవులందరికి ఒక సామాన్య లక్షణం బాధ—ఇది చాలా పరిపోషితమయితే,

మరింత చిక్కని కవిత వస్తుంది. 'దిగంబర తరం' వంటి కవితలు చదువరుల్ని అధికంగా ఆకర్షిస్తాయి.

## తమ్మి తెమ్మెర

[శ్రీ మధురాంతకం రాజారాం కథలు విశ్వప్రభ ప్రచురణలు, నేండ్రగుంట, చిత్తూరుజిల్లా వెల: రు. 4.]

శ్రీ రాజారాం కథలు తెలుగువాళ్ళకు బాగా తెలిసినవే!

పెళ్ళిలో లాభం, సంసారం ఉద్యోగం—పరస్పర ప్రభావాలు, అనవసరంగా ఎక్కువగా జాగ్రత్త పడే రామలింగం తొందర, రచయిత కంటే రచయిత భార్యకు సన్మానం చేయవలసిన కారణాలు, అన్నదమ్ముల్లో అన్న పెద్దవాడయి పోతే తమ్ముడు తెచ్చుకొన్న తెలివి, సుబ్బయ్యయినా రంగయ్యయినా, చివరికి పెద్దమనిషి అయినా డబ్బు విషయంలో ఉండవలసిన జాగ్రత్త, రచయిత కుటుంబ పరిస్థితి, లోకం నిండా ఉన్న సర్వీసు రిజిష్టర్లు, కార్బన్ గీయబోతే అందమయిన శిల్పం తయారయి ఏడ్చే రామనాథం బాధ, ఎప్పటికీ మాటలాడి తప్పించుకు తిరుగు వీరభద్రం 'అతి, తెలివి,' తప్పిపోయిన తమ్ముడు బైరాగిగా తిరిగి వచ్చినా స్వీకరించలేని రంగనాథం, రెండు తరాల సంసార సంగతుల్లో—తేడా, గది తలుపులు హృదయం తలుపులయితే వచ్చే గోడు, హృదయం లేనిచోట నుంచి వచ్చే కాలీ జాడీలు, వరుసగా ఈ సంపుటిలోని 14 కథలు అచ్చు బాగుంది. పుస్తకం బాగుంది. చదువ దగిన కథలు.

— మనోరాణి

## పొలికేక సచిత్రవారపత్రిక

శ్రీ సి. ఆర్. కొండపల్లి సంచాలకత్వంలో శ్రీమం. రాజేంద్ర సంపాదకత్వంలో వెలువడే సరికొత్త సచిత్ర వారపత్రిక 'పొలికేక'. ఇప్పుడున్న పత్రికల త్రోవలోనే ఆంధ్రరాజధాని నుంచి అందంగా అచ్చయి వచ్చే పత్రిక ఇది.

రైతాంగం కోసం ఒక ప్రత్యేక శీర్షిక ఇందులో కేటాయించరు. దానిపై సంపాదకీయంలో కొంత భయాన్నీ ఉత్సాహాన్నీ ప్రకటించారు.

—సీతరాజు

## సిపాయి చిన్నయ్య

సినిమాకథ [బొమ్మలతో] సురేష్‌మూవీస్ వారి ఈ సిపాయిచిన్నయ్య పెండెదెర నవలని శ్రీకాంత్, జ్యోతిశ్రీ వ్రాశారు. 183 పేజీలు రూపాయిన్నర మాత్రమే. స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్, విజయవాడ—2.

## ప్రాచీన పాశ్చాత్య నాటకరంగం

ప్రపంచ నాటక చరిత్ర 1వ భాగం. శ్రీనివాస చక్రవర్తి రచన. 116 పేజీలు. వెల రెండురూపాయలు. సంపాదకులు యం. పెరుమాళ్ళు. జయంతి పబ్లికేషన్స్, గోపాలరెడ్డిరోడ్డు, విజయవాడ—2.

# పుస్తకాలు

## యువసాహితి

గేయ సంకలనం. పదకొండుగురు యువకవుల గేయాలున్న చిన్న పుస్తకం. ఆంధ్ర విజ్ఞాన సమితి, ఇంజనీరింగు కళాశాల, అనంతపురం.

## మంచీ—చెడూ

నవల. ప్రఖ్యాత రచయిత కే. శే. శారద రచన. ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురించబడి పాఠకుల ప్రశంసలందుకున్న నవల. 218 పేజీలు. ధర: నాలుగు రూపాయలు. బృందావన్ పబ్లిషింగ్ హవుస్, మారిస్‌పేట, తెనాలి.

## కార్మిక స్వర్గంలో కళాప్రియుడు

విశ్వకవి రవీంద్రుని కథలు, గల్పికలు, భావ చిత్రాలు. అనువాదం శ్రీ కె. వి. రమణారెడ్డి, 132 పేజీలు. వెల. రు 2—50 పైసలు. ఎం. శేషాచలం అండ్ కో., మచిలీపట్నం.

## అపస్వరాలు

నవల. ఆంధ్ర సచిత్రవార పత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడి కే. శే. శారదకి పేరు తెచ్చిన నవల. 332 పేజీలు ఆరు రూపాయలు. బృందావన్ పబ్లిషింగ్ హవుస్, మారిస్‌పేట, తెనాలి.

## త్రిపథగ

కవిత. శబరి, రాధామాధవము, గోపిక అన్న శీర్షికలపై మధురకవి శ్రీమాలా పేరన్న శాస్త్రికవిత్వం. 41 పేజీల పుస్తకం రూపాయి. యం. వి. శాస్త్రి, డి. యుమ్. ఇ. ఆఫీసు, బిలాస్‌పూర్ [ఆర్. యస్.]

# తెలంగాణా సమస్య...

(7వ పేజీ తరువాయి)

ఉద్యోగ సంరక్షణలు లేనప్పుడు విద్యాభ్యాసం ఎందుకని కొందరు ప్రచారంచేసి విద్యార్థులని విద్యాలయాలకి వెళ్ళకుండా చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు. అయితే, సంరక్షణలు ఎవరికి? చిన్న ఉద్యోగులకి, ఇంజనీర్లకి, డాక్టర్లకి—ఇంకా అటువంటివారికి—కాదు. ఇటువంటి వారికి కూడా సంరక్షణలు అవసరమయితే దేశం గతి ఏమవుతుందో నాకు తెలియదు.

## రాజధానివద్ద కేంద్ర పరిశ్రమలు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత కేంద్రం నెలకొల్పిన పరిశ్రమలలో రు 150 కోట్లు పెట్టుబడి ఉంది. (విశాఖపట్నం, మరికొన్ని చోట్లలో రు 18 కోట్లు మాత్రమే పెట్టుబడి అయింది. వీటివల్ల ఏర్పడిన 25853 ఉద్యోగాలలో 85.7 శాతం ఉద్యోగాలు తెలంగాణా వారికే వెళ్ళాయి. మిగతాలో 7.8 శాతం ఆంధ్రప్రాంతం వారికి, 6.5 శాతం తక్కిన రాష్ట్రాలవారికీ వెళ్ళాయి. ఇంత చిటి వెలితలకా ఇంత పెద్ద ఆందోళన? తెలంగాణావంటి చిన్న రాష్ట్రం [పాత హైదరాబాదులో ఓడార్‌పోయి 9 జిల్లాలు మాత్రమే మిగిలాయి] ఇంత పారిశ్రామికాభివృద్ధిని సాధించగలదేనా? ఒక చిన్న రాష్ట్రం కేంద్రం మీద ఒత్తిడి తీసుకురాగలదా?

## పోయిన పరిశ్రమలు

(కలకత్తాలో కొందరు పారిశ్రామిక వేత్తలు ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు నెలకొల్పడానికి నిశ్చయించుకుని తెలంగాణా ఉద్యమం వల్ల మానుకున్నారని శ్రీ నరసింగరావుగారు అన్నారు. ఈ విధంగా వచ్చిన నష్టం రు. 50 కోట్లు అన్నారు.)

## విద్యాసంస్థల మూసివేత

విద్యాసంస్థలు మూసివెయ్యటం చేత ఎందరో విద్యార్థులు నష్టపోయారు. ఉద్యమం వెనుక ఉన్న కొందరు మిత్రులు తమ పిల్లలని పబ్లిక్ స్కూళ్ళకి పంపేవారు [ఇవి మూసివెయ్యబడేవి కావు.] నష్టపోయింది బీద, మధ్యతరగతివారే.

## ప్రజలకి సంరక్షణ, అఖిల భారతదేశం సంగతి

(శ్రీ నరసింగరావుగారు ప్రజాస్వామ్యంలో కొందరు కలిసి ప్రజాబాహుళ్యాన్ని ఇబ్బంది పెట్టటం సరి కాదనీ, ఇటువంటి సమస్యలని అఖిలభారత దేశం మొత్తం దృష్టిలో ఉంచుకుని పరిష్కారానికి వెతకాలనీ అన్నారు. అందరికీ సమానమయిన అవకాశాలు కలిగించటం మన రాజ్యాంగం లక్ష్యం అని గుర్తు ఉంచుకుని దీనికి చేసిన కృషి ఎంత చేశామని ప్రశ్నించుకోవాలన్నారు.)

## సహకారం అవసరం

(డా. ము. క. వారు ఏదీ దేశం నాశనం చేసే ఆదర్శ పెట్టేవారము కాదు, అలాగే ఏదీ తెలంగాణా ప్రచారాన్ని అడ్డుపెట్టలేము కాని వారు తమ సిద్ధాంతాలనీ ఆచారాలనీ ఇతరుల మీద బలవంతంగా రుద్దడం సరి కాదు. ఒక అంగడి మీద రాయివేస్తే, అంగడి యజమాని పద్దంటే పేచీ, పోరాటం తప్పదేమో.

## ఆర్థికాభివృద్ధి

[దేశంలోని పెద్ద రాష్ట్రాలు 50 చిన్న రాష్ట్రాలుగా విడిపోయినా లభించే లాభం ఏమీ లేదనీ, ఉద్యమం వల్ల వచ్చే అలజడి రాష్ట్రం అభివృద్ధికి అవరోధం అవటమే బాధగా ఉందని శ్రీ నరసింగరావుగారు అన్నారు. ఒకరి అంగడిమీద బాంబు వేస్తే యజమాని ఎదురు ఒడుగుతాడనీ దీనికి పరిణామం వారినీ, ప్రభుత్వాన్ని దూషించి లాభంలేదనీ అన్నారు.]

మనస్పర్థని 1972లో పరిష్కరించుకుంటే పడగొట్టాలి. నేను ఎల్లకాలం అధికారంలో ఉండము కదా! కాని, ప్రజాస్వామ్యంలో కొన్ని పద్ధతులు అనుసరించటం ముఖ్యమని మాత్రం గమనించాలి.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

